4


# ఆంధ్రభూమి

సర్వవిషయములను చర్చించు
సచిత్రాంధ్ర మాసపత్రిక.



స్థాపితము ౧౯౩౩
సాలుచందా 1-8-0

సంపాదకుడు :
ఆండ్ర శేషగిరిరావు, బి.

సంపుట : ౨. ప్రమాది, చైత్రము : ఏప్రిల్, 1939. సంచిక : ౯


# ఆంధ్రరాష్ట్ర నిర్మాణము

మదాసు మెయిలు సంపాదకునకు,

''సంపాదకమహాశయా!

ఆంధ్రరాష్ట్రాన్ని గురించి ఏప్రెల్ 3-వ తేదీని మీ పత్రికలోని సంపాదకీయం చదివాను. కొత్త రాష్ట్రముల నిర్మాణాన్ని గురించి ఇండియా గవర్నమెంటు ఆక్టులోని సెక్షనులను ఉపలక్షించి మీరు ఇట్లు చెప్పారు:

''కొత్తరాష్ట్రనిర్మాణము ఫెడరేషన్ దరిమిలాను కాని ఫెడరేషన్ కు పూర్వమే కాదనుట 1935-వ ఇండియాగవర్నమెంటు యాక్టు నిరూపిస్తూవుంది.''

ఈ సందర్భంలో ఈ సమస్యకు సంబంధించిన ఆ యాక్టులోని కొన్ని సెక్షనులను పేర్కొనుట మంచిది. 290-వ సెక్షను ప్రకారము ఇండియాచక్రవర్తి రాష్ట్రప్రభుత్వం యొక్క, ఫెడరల్ ప్రభుత్వం యొక్క అభిప్రాయాన్ని తెలుసుకుని కొత్తరాష్ట్రనిర్మాణానికి వెంటనే పూనుకొనవచ్చు. అప్పుడే ఆసంబంధమైన ప్రథమ ప్రణాళిక పార్లమెంటులో ప్రవేశపెట్టవచ్చు. ఇప్పుడు ఇక్కడ ఇంకా ఫెడరల్ ప్రభుత్వం ఏర్పడలేదు. దాని స్థానంలో కేంద్రప్రభుత్వం ఉండనేవుంది. దాని అభిప్రాయాన్ని తెలిసికొనే ఇండియాచక్రవర్తి ఇపుడు కొత్తరాష్ట్రనిర్మాణానికి దారకొనవచ్చు. సెక్షనులు 313,316 ఇప్పటి కేంద్రప్రభుత్వము ఫెడరల్ప్రభుత్వానికి ప్రత్యామ్నాయంగా వ్యవహరించుచుండుటను తెలియచేస్తున్నాయి. ఫెడరల్ ప్రభుత్వంఏర్పడేలోపల వ్యవహరించుటకు ఇప్పటి కేంద్రప్రభుత్వానికి అనుమతివుంది. ఈ స్థితిలో కొత్తరాష్ట్రము ఫెడరేషనుకు దరిమిలానే కాని పూర్వం నిర్మింపబడడానికి అవకాశంలేదని మీరు అంటే అది అర్థంలేనిమాట అవుతూవుంది.

కొత్తరాష్ట్రానికి వలయు కార్యకలాపాలు కొనసాగే లోపలనే సరిహద్దు సమస్యలు మాకు మేమై పరిష్కరించుకోవడం మంచిదని మీరు సూచించారు. మా సరిహద్దులు కొంచెం ఇంచుమించుగా పరిష్కృతాలు అయ్యే వున్నా
కొన్ని సంవత్సరాలకు పూర్వ
దక్షిణాన్నివున్న తెలుగుగ్రామా
ప్రత్యేకింపబడి చిత్తూరుజిల్లా ప్ర
కంగా ఏర్పాటు చేయబడ్డది.
జిల్లాబోర్డులో బాధ్యతగల ప
లోవున్న ఒక తమిళమిత్రుడు చె
ల్పట్టు జిల్లాలో నలభై గ్రామా
తెనుగే మాతృభాషగా కలవి
న్నాయి అనీ, ఆగ్రామాలతో వ
హారం అంతా తెనుగులో చే
వలసి వస్తూవుందని చెప్పివున్నా
ఆ గ్రామాల్ని తెలుగు జిల్లాల
కలుపుకోవలసిందిగా ఆ మిత్రు
సూచించాడు. నేను ఆ మిత్రు
ఆంధ్రులకు ఆ విషయంలో
పట్టింపు లేదని చెప్పాను.
ఆ మిత్రుడు ఎక్కువ పట్టింపు
వున్నాడు. ఏమంటే ఎల్లప్పుడు
అతడు వ్యవహారం రెండుభాష
చేయవలసివస్తూవుంది గనక. అ
మేమున్నా చిత్తూరుజిల్లాలో చే
పడివున్న తమిళగ్రామాల్ని త
దేశానికి ఇచ్చివేయడానికిన్నీ స
ద్ధులమై వున్నాము.

ఇక పశ్చిమాన్ని కర్ణాటక సరి ద్దులో కాంగ్రెస్ చాలా కాలా పూర్వం 1921 లోనే ఆ విష ం సమాలోచించింది. అప్పుడు సరిహద్దులకు కేల్కారు పరిష్క గా నియమింపబడ్డాడు. ఆ పరి ర్త బళ్ళారి విషయంలో నిర్ణ ం చేసేవున్నాడు.

ఇక ఉత్తరాన్ని ఆంధ్రోత్కళ హద్దు విషయంలో చాలా రా ంతసిద్ధాంతాలు జరిగాయి. విషయంలో ఒక నిర్ణయం జరి ది. ఆ నిర్ణయం పునర్విచార కు కొనిరాతగిందిగా వుంది అని ంగీకరించకతీరదు.

సరిహద్దు సమస్య పరిష్కరించు వడానికి తెలుగు వారితో వొక ోట తమిళులు, మరి ఒకచోట న్నడులు, వేరొకచోట ఓఢ్రులు సి సంప్రదింపులు సాగించాలి. అంత సులభవిషయం కాదు. లభమైవుంటే ప్రపంచంలో ఇన్ని గాదాలు వుండకుండును, ఇన్ని ర్టులు అవసరంలేకుండును. అదిన్నీ క ఈ సమస్య క్లిష్టమైనది. ఏ ఒకపార్టీ చెప్పినది అంతామా మే సత్యమని చెప్పడానికి అవ శం వుండదు. ఈ పరిస్థితుల్లో క కమీషను ఏర్పడడం వాంఛ యం. అట్లా అయితే జాతికి జా ఘర్షణవుండదు. అయినా సరి ద్దుల సమస్య చాలవరకు నిర్ణీ మైనట్లే మనం భావించవచ్చు.

ఈ విషయంలో నిర్ణీతం కావ సిన విషయం మరి ఒకటివుంది. మూడు దిక్కులనువున్న మూడు సరిహద్దుల్ని గురించే నేను చెప్పివున్నాను. పశ్చిమోత్తర దిశను చాందా జిల్లాలో మహారాష్ట్రులతో మేము నిర్ణయించుకోవలసిన నాలుగో సరిహద్దువుంది.

సెక్రటరీ ఆఫ్ స్టేట్ నిర్ణయం రాక పూర్వం మాకు మేమై సరిహద్దుల సమస్య మేము పరిష్కరించుకోవాలని మీరు పేర్కొనడంలో మీరు ఇట్టి రాజకీయ విషయాలలో చూపవలసినంత విశాలదృష్టిని, నిశితప్రతిభను చూపలేదని నా భయము.

రాష్ట్రం వెంటనే నిర్మింపబడక పోతే సత్యాగ్రహం చేస్తామని ఆంధ్రులు భయపెట్టడం సమంజసంగా లేదని మీరు అన్నారు. మీ అభిప్రాయంతో నేను ఏకీభవిస్తాను. రాష్ట్రనిర్మాణంపట్ల జరుగుతూవున్న ఆలస్యాన్నిపట్టి ఆంధ్రులట్టి పనులమీద చిత్తాన్ని బరుపుతున్నారు. నా సోదరాంధ్రులు ఈ విషయంలో కొంచెం ఓరిమి వహించివుంటారని నేను ఆశిస్తున్నాను.

పైగా ఇండియా కార్యదర్శికిని, మద్రాసుప్రభుత్వానికిన్నీ ఆంధ్ర రాష్ట్రనిర్మాణవిషయంలో నడిచిన ఉత్తరప్రత్యుత్తరాలు ప్రచురపరుప వలసిందిగా కొందరి ఆంధ్రుల కోరిక అయినట్లు తెలియవస్తూవుంది. ఉత్తరప్రత్యుత్తరాలు ప్రచురించుట అనగా ఇక ఆ విషయం ముగించి వేయడమన్న మాట.

మనరాష్ట్రప్రధాని ఇంకా ఈ విషయంలో ఉత్తరప్రత్యుత్తరాలు సాగుతున్నాయి అనీ అందుకుచేత వానిని ప్రచురించజాలననీ వెల్లడ పరచివున్నాడు. అనగా ఏ మన్న మాట? ఇండియామంత్రి చిత్తాన్ని మార్చడానికి మన ప్రధాని ఇంకా శాయశక్తులా ప్రయత్నిస్తున్నాడనేగదా!

ఉత్తరప్రత్యుత్తరాల ప్రచురణ కోరడంలో మనవారి ఉద్దేశం ఇండియామంత్రి ఏ కారణాలచేత సత్వర ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి ఒప్పుకోలు ఈయలేదో తెలుసుకోవాలనే అయివుంటుంది.

ఆంధ్రరాష్ట్ర శీఘ్రనిర్మాణానికి ఇండియా మంత్రి ఏ హేతువులచేత అడ్డుతగులుచున్నాడో మనం సులభంగానే ఊహించుకోవచ్చు. మీ సంపాదకీయంలో ఆ హేతువులు కొంతవరకు తడవబడ్డాయి.

కాన్‌స్టిట్యూషనల్‌గా అభ్యంతరం వుండరాదని పైన వివరించియే వున్నాను. ఇక ఏ కారణం అతను చూపినా అతనిమాట ఈ విషయంలో తుదిమాటగా మద్రాసు మంత్రులు భావించరు.

పైగా ఈవిషయం మద్రాసు మంత్రుల ఆత్మగౌరవానికి సంబంధించింది కూడాను. కాగా ఆంధ్ర సోదరులను అందర్నీ మద్రాసు మంత్రివర్గంమీద, వారి నాయకుడైన ప్రధానిమీద సంపూర్ణ విశ్వాసాన్ని వుంచవలసిందిగా ప్రార్థిస్తున్నాను.

—భోగరాజు పట్టాభిసీతారామయ్య.

# వేఁకువపాట

(ఆనందభైరవి)

పసిఁడిమెఱుంగుల తళతళలు
పసిమివెలుంగుల మిలమిలలు
గోదాకృష్ణల గలగలలు
గుడిజేగంటల గణగణలు

మెరసి, మొరసి, మించిన శుభసమయము తల్లీ!
తరళయశోవతి! అనుపమితరాగవల్లీ! నీ
వరపుత్రుల చేమోడ్పు లివె తెలుఁగుతల్లీ!

కవిపికముల సల్లాపములు
గాయకబర్హ్యాలాపములు
లాస్యత్ఖగ విన్యాసములు
భాస్వత్పటహనినాదములు

విరిసి, మ్రోఁగి పరచిన శుభసమయము తల్లీ!
సరళోక్తిమధురసవతీ! కోమలవల్లీ! నీ
వరపుత్రుల చేమోడ్పు లివె తెలుఁగుతల్లీ!

హాలిక జనకలహాసములు
శ్రామికజన మధుహాసములు
దాస్యవిముక్త నివాసములు
స్వతంత్ర ప్రభావికాసములు

బలసి, మెలసి, చెలఁగిన శుభసమయము తల్లీ!
చరణాంకితశతమకుటగతకాంతివల్లీ! నీ
వరపుత్రుల చేమోడ్పు లివె తెలుఁగుతల్లీ!

—బాలాంత్రపు రజనీకాంతరావు.

# 40 ఔన్సుల నెత్తురు

40 ఔన్సుల రక్తమునుండి కాని ఒక ఔన్సు శుక్లము ఉత్పత్తి కాదని శాస్త్రవేత్తలు చెప్పుచున్నారు. దీనినిబట్టి శుక్లము ఎంత విలువ యైనదో తెలిసికొనవచ్చును. అట్టి శుక్లము మూత్రములోగాని, స్వప్నములోగాని పోవుచున్నచో ఇక పురుషునకు ఇహలోక సుఖమెక్కడ? కాబట్టి సుఖానందములపై దృష్టియున్నచో

## శుక్లనష్టమును

ఎంతమాత్రమును అశ్రద్ధచేయక వెంటనే చికిత్సచేసి శుక్లరక్షణము గావించుకొనవలయును. పలుచబడిన వీర్యమును గట్టిపఱచి అమితముగా వీర్యవృద్ధిని కలిగించు వనమూలికలకు రాజైన రత్నపురుష ప్రధానద్రవ్యముగా చేయబడిన

# రత్నపురుషలేహ్యము

క్రమముగా సేవించుటచే తప్పక శుక్లరక్షణము జరుగును. మరియు ఈరత్నపురుషలేహ్యసేవనమువలన

| | | |
|---|---|---|
| కండపుష్టి | : | కాయపుష్టి |
| బలము | : | ఆరోగ్యము |
| శరీరబింకం | : | జీవితసౌఖ్యం |

పొందుదురు. రత్నపురుషతో అమోఘవీర్యములగు పెక్కు ఇతర వనమూలికలుచేర్చి తయారుచేయబడిన తియ్యని రసాయనము. శుక్లనష్టమును సూటిగ కుదుర్చు మధురమగు మందు. మేహరోగుల పాలిటి వరప్రసాదము.

నెలకు ఒక పౌను. వెల రూ. 3-0-0. తపాలాఖర్చులు ప్రత్యేకము.

రత్నపురుష డిపో,

2/40 పెద్దినాయునివీధి,

మదరాసు.

## ఆంధ్రభూమికి అపూర్వాలంకారము.

### జయాఫిలిమ్సువారి

# మహానంద

పాపకులములోబుట్టి, పాపవృత్తికిలోబడక, పతివ్రతయై, ప్రపంచానికి ఆదర్శమైన మామహానంద

ఏప్రిల్ నెలలో ఆంధ్రదేశమందలి అన్నినగరాలకు వస్తూవుంది. నిరీక్షించండి.




నటీనటులు :

కృష్ణవేణి

అద్దంకి

పారుపల్లి

కుంపట్ల

బాలసరస్వతి

పులిపాటి

మొదలగువారు.

డైరక్టర్ :
టి. మార్కొని.

---

బుక్కింగుకు :—

## విజయ అండ్ కో,

మిర్జాపూర్ హౌస్, మైలాపూర్ పోస్టు, మద్రాసు.

## తాను ఎంత సంపాదిస్తున్నాడో మగడు పెళ్లానికి తప్పక చెప్పాలా ?

# రాబడి భార్యకు చెప్పాలా ?

భర్తలారా! మీ ఆదాయాలసంగతి
మీ భార్యలకు అంతుపట్ట నీయకండి.
భార్యలారా! మీ భర్తల ఆర్జనయొక్క
అంచనాకు ఆటమటించకండి.

రచయిత :

## వేపా మురళీధరరావు, బి.యస్.సి.

తాను ఎంత సంపాదిస్తున్నాడో మగడు పెళ్లానికి చెప్పాలా?

ఇదీ సమస్య.

ఈ సమస్యను గురించి జిజ్ఞాస రేగిన ఒక ఆంగ్లమహాపురుషుడు ఇంగ్లాండులో ఇంటింటికి తిరిగి ప్రతి ఇల్లాలినీ ప్రశ్నించాడు 'అమ్మా! నీ భర్త ఎంత సంపాదిస్తున్నాడూ?' అని.

ఆ ప్రశ్నకు చాలామంది గృహిణులు తగుమైన సమాధానం చెప్పలేక పోయారు. చాలామంది ఇల్లాండ్రకు వారివారి భర్తల సంపాదన ఎంతో తెలియదు అనే సంగతి ఆవిచారణలో తేలింది.

నామట్టుకి నేను నా ఆదాయం ఎంతో, నా సంపాదన ఎంతో నా భార్యకు చెప్పకుండా దాచివుండలేదు. కాని ఇప్పటి నా అనుభవం ప్రకారం చెప్పకుండా వుండివుంటేనే బాగా వుండేదిఅని తోస్తుంది.

నేను తిరిగి కొత్తగా వైవాహికజీవితాన్ని ప్రారంభించవలసి వుంటే మాత్రం నా ఆదాయం ఎంతో, నా ఆర్జన ఎంతో నా భార్యకు చెప్పేదిలేదు.

తమ ఆదాయం, తమ ఆర్జన ఎంతో భార్యలకు చెప్పకుండావుండే అలవాటు ధనికులయిన భర్తల్లోనే విస్తారంగా కనిపిస్తూవుంది.

పేదకుటుంబాల్లో భర్తలు తమ ఆదాయంవిషయంలో ఇంతటి రహస్యాన్ని ఎప్పుడూ చూపించరు.

ఏడాదికి పదివేల పౌనులకంటె ఆదాయంవచ్చే ఆంగ్లభర్తల భార్యలకు తమ మగళ్ళ ఆదాయం సంగతి బొత్తిగా తెలియనే తెలియదని చెప్పవచ్చు.

అట్టి భార్యలకు తమ భర్తల ఆదాయం తెలుసుకోవలసినంత అవసరంవుందని కూడా నేను అనుకోను.

ఏమంటే? వారి అక్కరలకు కావలసిన పైకం పుష్కలంగా వారికి ఈయబడుతూ వుంటుంది. డబ్బుకోసం చిక్కు పడడమంటే ఏమిటో వారికి తెలియదు. ఇక మగని సాలుసరి ఆదాయం ఏపాటిదో తెలుసుకోడానికి భార్యకు ఏమంత కుతూహలంవుంటుంది?

ఇక పేదకుటుంబాల సంగతి. సామాన్యపు ఖర్చులు పోగా మిగిలే పైకం చాలా తక్కువగా వుంటుంది. భార్య ఏదో కోరిక కోరుతుంది. ఆ కోరిక చెల్లించలేక పోయినదానికి ఉపపత్తిగా అట్టి స్థితిలో పెనిమిటి పెళ్లానికి తన ఆదాయం సంగతి అంతా చెప్పివేయవలసి వస్తుంది.

అందుకుచేతనే ఒక మహనీయుడు ఏ కుటుంబంలో భర్తయొక్క ఆదాయం సంగతి అంతా ఆ మూలాగ్రంగా అర్ధాంగికి తెలిసి వుంటుందో ఆ కుటుంబం తప్పకుండా పేదకుటుంబమై వుంటుందని నిర్వచనం చేశాడు. ఏకుటుంబంలో యజమాని ఆర్జన పెళ్లాంయొక్క అవగాహనకు అందదో, అంచనా కట్టడానికి అర్ధాంగి అయత్తపడదో ఆ కుటుంబం ధనికకుటుంబమై వుంటుంది.

ఇంకో సంగతి—భర్త తన ఆదాయం సంగతి పెళ్ళానికి తెలియకుండా వుంచుతున్నాడన్న మాత్రం చేత ఆ భర్త నీచుడని, కృత్రిముడనీ మనం అనుకోకూడదు.

భర్త ఉదారభావుడూ, దయార్ద్రహృదయుడూ కావడంచేతనే తన ఆదాయం సంగతి ఇల్లాలికి తెలియకుండా కాలక్షేపం చేసుకువస్తున్నాడని మనం అనుకోవలసి వుంటుంది.

ఏమంటే, భర్త ఆదాయం సంగతీ, ఇంటిక్రింద ఖర్చు అవుతూ వున్న పైకం సంగతీ భార్యకు బాగా తెలిస్తే ఆ ఆదాయానికి ఈ వ్యయం హెచ్చు అనే బెంగ ఆమెకు కలగవచ్చు. అది కలిగిననాడు ఆమెకు కుటుంబంలో పూర్వపు సుఖం వుండదు.

మరో విషయం. భర్తలు తమ ఆదాయం సంగతి భార్యలకు చెప్పకుండా వుండడానికి ఇంకో కారణం వుంది.

ఆడవాళ్ళనోట నువ్వుగింజ నానదు. తమ భర్తల ఆర్జన సంగతి వారికి పూర్తిగా అంతుపడితే వారు దానిని రహస్యంగా వుంచరు—వుంచలేరు కూడా.

ఇతడి పెళ్లాం ఇతడి ఆదాయం సంగతి స్నేహితురాలయిన అతడి పెళ్ళాంతో చెబుతుంది. అతడి పెళ్లాం అతడితో చెబుతుంది. అందుతో ఇతడిసంగతి అతడికి అర్థమౌతుంది. పెదవిదాటితే పృథివి దాటుతుందనే సామెత ఈ పట్ల బాగా సార్థక మౌతుంది.



వరవిక్రయములో ఒకదృశ్యము—
బళిజేపల్లి లక్ష్మీకాంతకవి : దాసరి కోటిరత్నము.

ఏ విషయమైనా సరే రహస్యంగా వుంచదలచుకుంటే రహస్యంగానే వుంచు అనే పెద్దల ఉపదేశం ఈసందర్భంలో అవలంబించతగిందని అనుభవజ్ఞులనేమాట అక్షరాలా నిజం.

ఇంతకీ, భర్త ఆదాయం ఎంతో తెలిసినంతమాత్రంచేత భార్యకు కొత్తగా ఒలికేది ఏమన్నా వున్నదా?

నా అనుభవాన్నిపట్టి ఏమీ లేదని నేను చేయియెత్తి చెప్పగలను.

కుటుంబంలో ఆర్థికంగా కొంత బాధ వచ్చిందనుకోండి. ఆ బాధ ఇద్దరూ పడడంవల్ల దాని తీవ్రత ఏమైనా తగ్గుతుందా? అది కొంచానికి కొంచెమేనా నివారింపబడుతుందా?

తగ్గదు – నివారింపబడదు.

అట్లాంటి సందర్భంలో భర్త యొక్క ఆర్థికవ్యథలు భార్యకు తెలియడంవలని ప్రత్యేకలాభం వుంది?

అదిన్నీకాక, ఇల్లాండ్రు ఆర్థికవ్యథలకు తట్టుకోలేరు. తమ కుటుంబపు ఆర్థికదుస్థితి వారికి తెలిస్తే వారు మగవారికంటె ఆ విషయంలో ఎక్కువ బెంగపెట్టుకుని వ్యథపడతారు. అట్టి స్థితిలో మగడు ఉన్న ఆర్థికవ్యథలకు ఆటమటించడానికి తోడు ఉపరి భార్యను ఊరడించే బాధ్యతకూడా వహించాలి.

...కే, ఆర్థిక దుస్థితి వున్నప్పుడు ...దానికి చెప్పకుండా వుండడమే ...ంచిది. అంగీకరిస్తాము. మరి, ...టుంబం ఆర్థికంగా సుస్థితిలో వున్న ...డు ఆ సంగతి భార్యకు ఎందుకు ...ప్పకూడదు అని మీరు ప్రశ్నించ ...చ్చు. దానికి నాసమాధానం ఏమి ...ంటే సుస్థితిలో వున్నప్పుడు ఇక ...ర్య ఆసంగతిని తెలిసికోవడం ...వసరం లేదని.

...మనం వివాహకాలంలో ధర్మే ..., అర్థేచ, కామేచ నాతిచరామి ...ని ప్రమాణాలు తీసికొన్నాము. ...ంతమాత్రంచేత అర్థవిషయం యావత్తూ భార్యకు చెప్పాలని మనం అనుకోకూడదు. చెప్పడంవల్ల చెడు వువుంది. చెప్పకుండా వుండడంవల్ల చెడువులేదు సరికదా ఒక్కొక్కప్పుడు లాభంకూడా వుండవచ్చు.

కాబట్టి భర్తలారా! మీ ఆదాయాల సంగతి మీ భార్యలకు అంతుపట్ట నీయకండి— భార్యలారా! మీ భర్తల ఆర్జనయొక్క అంచనాకు అటమటించకండి.

ఆర్జన భర్తది—అనుభవం భార్యది. కుటుంబవ్యవహారం ఆనాదిరిగా సాగుతూ వుండడం మంచిది. దంపతు లీసంగతి గ్రహించాలి.



రాధాకృష్ణలోని 'అక్రూరుడు'

## అతిత్వరలో అన్ని తెలుగుపట్టణాలలోను విడుదల కాబోతున్నది

మహాకవి కాళ్ళకూరి నారాయణరావుగారి నాటకరాజము

కవితాకళానిధి బలిజేపల్లి లక్ష్మీకాంతకవి నటించిన చిత్రము.

# VARVIKRAYAM

*EAST INDIA FILM CO. presents*



ఇది

ఏపాశ్చాత్యచిత్రానికీ

తీసిపోదు.

"హిందూస్థాన్ స్టాండర్డ్"



# వరవిక్రయము

డైరెక్టర్ సి.పుల్లయ్య

AUTHOR KALLAKURI NARAYAN RAO

RECORDING RCA

శ్రీరంజని : భానుమతి : పుష్పవల్లి : దాసరి కోటిరత్నము.

*For Bookings :*

## Chamria Talkie Distributors

20, Vepery High Road, P. T., MADRAS.

## కేటి బ్రిటిష్ ప్రధాని ఛేంబర్లేన్ భార్యవల్ల బాగుపడ్డాడు

# ఛేంబర్లేన్ సతి

ఆమె అన్నివిధాలా భర్తకు అనుకూలవతి.
గృహకృత్యాలలో ఆరితేరిన అర్థాంగి.
మనసులో వర్తించే కులకాంత.
స్త్రీలోకానికి ఆమె ఆదర్శప్రాయురాలు.

రచయిత:
**కొత్తపల్లి శ్రీరామమూర్తి, యల్.యం.ఇ.**

భార్యవల్ల బాగుపడినవారిలో ిటిష్ ప్రధాని నెవిలీఛేంబరలైన్ కడు. బాల్యంలోనే తల్లికరవైంది విలీ చాంబరలైనుకి. తండ్రిచాటు పెరిగాడు. తల్లి లేనందున మధుర ున ప్రేమ అతనిలో కనుపించేది ాడు. జీవితం ఆనందంగా వుండేది ాడు. కాని ఏనీకోలును చెట్టబట్టిన ాటనుండి అతనిజీవితం మధురాతి ధురంగా సాగుతోంది. ఆమె తన ర్తకు తలలోని నాలుకై, అతని ంతరంగం తెలుసుకొని మసులు ోంది. భర్తను విశాలవిశేష ంగ్లసామ్రాజ్యానికి ప్రధానామా ్యునిగా చేసిన శీలవతి ఆమెయే.

ఒకసారి ఆమెను గూర్చి ేంబరలైను యిట్లా చెప్పాడు. ాజకీయరంగంలో నాయకులు మ అర్థాంగులకుపడే ఋణం తన న్నా ఎక్కువ ఎవరూ పడివుండ రనీ, తనభార్య ఎల్లవేళల తన జయమునకు ఉప్పొంగిపోతుందనీ, వొకవేళ అపజయం వచ్చినా ధైర్యంచెప్పగల సమర్థురాలనీ, తగు సలహాలనిచ్చి అతనిని మార్గంలో పెడుతుందనీ, ప్రమాదాలను ఎత్తి చూపి జాగ్రత్తగానుండునట్లు సలహాయిస్తుందనీ, రాజకీయాలలోపడి మానవసేవ మరిచిపోకండా జ్ఞాపకంచేస్తూవుంటుందని, తన రహస్యాలనన్నింటిని అతిభద్రంగా కాపాడుతుందనీ, ఆలాంటి సహధర్మచారిణి దొరకడంవల్ల తనజీవితం ధన్యమైందని వచించాడు. భర్తపొగడ్తలకు గురియైనభార్య అదృష్టమే అదృష్టముకదా!

కార్యేషుదాసీ, కరణేషు మంత్రీ అనేశ్లోకం ఆమెకే వర్తిస్తుందనుకుంటాను.

భర్త యింతపొగుడుతూవున్నందుకు ఆమె ఆనందంపొంది నమ్రత ప్రదర్శించునే కాని గర్వింపదు. వారి సాంసారికజీవనం వారి యొక్క ఐక్యభావమువల్ల ఆనంద జలధిలో నోలలాడుచున్నది.

భర్తలను ప్రోత్సహించి ఉన్నత పథమునకు కొనివచ్చినవారిలో ఛేంబరలైను సతి అగ్రస్థానం వహిస్తుంది.

ఆమె ప్రోత్సాహమే లేనినాడు మన ఛేంబరలైను మంత్రిపుంగవుడు గాడుగు అవసరంలేకుండా ఏ వర్తకుడిగానో వుండిపోయేవాడే. ఆమెను పెళ్లాడేవరకు వానిజీవితసాధమునకు ఏమియు శోభకనుపించలేదు. ఆతని సంసారనౌకకు ఆమె చుక్కాని ఐనతరువాతనే వడుదుడుకులు లేకండా గమ్యస్థానమునకు చేరుచున్నది.

ఛేంబర్లలైను 21–వ ఏట జనుము వ్యవసాయం చేయించుటకుగాను బహామాసు వెళ్ళాడు. దానివల్ల అతనికి ఆనందంలేక పోయింది. ఏడేళ్ళుగడిపి తిరిగి యింటికి చక్కావచ్చాడు. అప్పుడు అతనికి పెళ్ళిమీద పిచ్చపట్టింది. తగిన స్నేహితురాలికొరకన్వేషింపసాగాడు.

ఆనికోలు సంఘజీవి. హాస్యరసప్రియురాలు. ఆమె ఒక సేనాధిపతి కూతురు. తండ్రితో ప్రయాణాలు చేసేది. ఆప్రయాణాలలో అనేక రకముల ప్రజలను కలుసుకునేది. వారితో కలసి ఛలోక్తులాడుచూ గడి

పేది. ఆమె సోదరుడు హార్సుడి వెరీ కోలు మరీ హాస్యప్రియుడు. ఒక సారి అతడు జాంజిబారుసుల్తానుగా వేషంవేసి అతడుండే ఓడలోని ప్రజలకు వినోదం కలిగించాడు.

ఛేంబరలైను మతమునందు, సమిష్టిగా నుండుటయందు, వర్తకమునందు, రాజకీయములందు ప్రజ్ఞాప్రాభవములుగల కుటుంబంలో ప్రభవించాడు.

తిరిగి తనదేశంరాగానే వూరికే వుండలేక—సోమరి కాడు కనుక—వెంటనే ఓడలు నిర్మించే కంపెనీలో వాటాదారుడైనాడు. దాంతో ఒక పెద్ద వర్తకుడైనాడు.

అతనిని ఆకర్షించింది ఎవరు? అతనిక్రింద పనిచేయు ఏనీకోల్. అతనికి ఆనందంగా వుండేది ఆమెను చూస్తే. ఆఫీసులో అర్ధరాత్రివరకు పనిచేయడం మానేసాడు. తనకి అవకాశం చిక్కినప్పుడల్లా ఆమె యింటికి పోయేవాడు కులాసాకోసం. ఆమె స్నేహంవల్ల వెధవ వర్తకంకన్నా ముఖ్యమైనవి జీవితంలో చాలా వున్నాయి అని ఆనాడు తెలుసుకున్నాడు. రాజకీయాలు: ప్రేమ—ఛేంబరలైను ఆమెను వివాహం చేసుకునేసరికి నలభైఏండ్లవాడు. కోల్సుకుటుంబం యీ సంబంధానికి చాలా సంతసించారు. ఏనీని తమ కుటుంబంలోనికి తీసుకొన్నందుకు ఛేంబరలైను వంశంవారు మురిసిపోయారు.

వారిజీవితంలో మార్పుకలిగింది. ఆ నూతనదంపతులు మనుగూడుపులు (హనీమూన్) కుడుచు సమయంలో ఒకనాటి సంధ్యాసమయమున భార్య భర్తతో 'మీరు ఎందుకు రాజకీయాల్లో దిగకూడదూ?' అంది.

నెవిలీకి ఆ విషయంలో అంత నమ్మకంలేదు. రాజకీయాల్లో అతనికి జయంవస్తుందని అతను అనుకోలేదు. కాని ఆమె అతనిని ఒప్పించింది. రాజకీయాలవల్ల యిప్పటికన్నా ఎక్కువకీర్తి వస్తుందని నచ్చచెప్పింది. దానికి కాలపరిమితి పొకయిరవై సంవత్సరాలంది. పద్ధతి చెప్పింది. 'ప్రధమంలో పురపాలక సంఘాలకు వెళ్లు. అందులో ప్రజలు నిన్నుకోరుదురో కోరరో తెలుసుకొనవచ్చును. అక్కడ అనుభవం సంపాదించవచ్చు. తరువాత పార్లమెంటుకి నిలువు.' యిది ఆమెయిచ్చిన సలహా.

ఆమె మాటమీదనే నడిచ
ఆధీరుడు. వారి మనుగూడువు
యిన నెలరోజులకే బర్మింగుహ
పురపాలకసంఘసభ్యుడయినా
ఆవూరిలోని గుడిసెలను బాగ
యుట కేర్పడిన ఉపసంఘానికి
ధ్యక్షుడైనాడు. అందులో ప్ర
పడి పనిచేసి ప్రజాహృదయమ
చూరగొన్నాడు. తరువాత ఆ
రమునకు అల్డరుమెన్‌గా ఎ
కోబడ్డాడు.

ఛేంబర్లైను ప్రజామో
డైనకొద్దీ ఆమె తెరచాటుగవు
తన సంసారం జాగ్రత్తగా గడ
చూ బిడ్డలను చూచుకొంటూ
లంగడిపేది. తల్లిగా యిల్లు
కోడాని కామె ఎంతయో సంత
చేది. వచ్చినవారికి ఆతిథ్యమి
గృహిణిపదమే ఆమెకు ఆనం
కలిగించేది. గొప్పవానిభార్య



లక్ష్మీసినీటోనువారి ప్రసూనము!!

రాధాకృష్ణ

స్థానం : నారదుడు.

ంఢదగ్గ ఔదార్యం ఆమెయందు ప్టుకతో నేవుంది. ఆగొప్పవానికి ొప్పసుఖము నిచ్చేవనిత ఆమె.

నాలుగుసంవత్సరాలలోనే నెవి ఛేంబరలైనును బర్మింగుహాము మేయరుగా ఎన్నుకొన్నారు. అతడు న గృహముచేరి యీ శుభవార్త భార్యకు తెలిపాడు. ఏనీ అతి నందంతో ముద్దుపెట్టుకుంది. భో నానికి లెమ్మంది. ఎంతో అప్యాయంగా 'నీవు లేడీమేయరువు సుమా' అన్నాడు నెవిలీ. 'నేను మీ భార్యను' అంది అడకువతో. అందులోనే ఆమె శీలము తేటపడుచున్నది. మేయరుభార్య అయినందున ఆమె ఆగుడిసెలకు స్వయంగా ఆహారము బట్టలతో తీసుకుపోయి బీదలకు పంచిపెట్టేది. ఆమె సేవకు బీదలు ఆమెను 'దేవత' అనేవారు. అందులో ఆశ్చర్యములేదు. దంపతులకు కూతురు, కుమారుడు వున్నారని తెలుసుకుని ఆ ప్రజలు ఆనందభరితులైరి. బిడ్డలుకల తల్లికే ప్రజలపై ప్రేమకాని గొడ్రాలి కేమి తెలుసు—

ఆ కూతురు నామము 'డరోతీ' తివైభవంగా ఆ పిల్లను స్టిఫెన్ లాయడ్ కు యిచ్చినాడు. నెవిలీ కుమారుడు ఫ్రాన్ కు అనువాడు. వేటకు వెళ్ళినా, చేపలు పట్టడానికి వెళ్ళినా నెవిలీకి అతడు తోడుగా వెడతాడు. దంపతులనడుమ ప్రేమను వృద్ధిచేయడానికి విధి నిర్ణయించిన మందు సంతానమేనని వారినమ్మకం.

ఏనీ స్త్రీలకు ఆదర్శకురాలు. స్త్రీలు ఆమెను ప్రేమింతురు. బర్మింగుహాములోని ప్రజలు స్త్రీలలో ఫ్రీసిటిజను షిప్పు పొందేవారిలో ప్రథమురాలు ఆమెయేయని సూచించిరి.

గత ప్రపంచ మహాసంగ్రామ సమయంలో ఆమె సైనికుల యిండ్లకుపోయి వారితల్లులకు, తరుణులకు, పిల్లలకు ధైర్యం చెపుతూ వారికి ఆనందం కలిగించేది. 100000 మంది స్త్రీలచే ఆమె జర్మనీలోచిక్కిన సైనికులకు ఉత్తరాలు వ్రాయునట్లు చేసింది.

ఆమెసేవ, భర్త నెవిల్ యొక్క మేయరుపదవి లాయిడ్ జార్జిని ఆకర్షించినవి. కాగా లాయిడ్ జార్జి నెవిలీని నేషనల్ సర్వీసుయొక్క డైరెక్టరుజనరల్ గా నియమించాడు.

అది ప్రభుత్వంలో బాధ్యతగల పదవి. అదే నెవిలీకి అవకాశం కలిగింది. కామన్సు సభలలో కొంత ఖ్యాతి సంపాదించాడు దానిమూలాన. కాని ఏనీ వీధిఎక్కక యిల్లు దిద్దుకుంటూనేవుంది. ఆమెపెరటిలో బంగాళాదుంపలు పెంచుతూ వుంది. ఇంత అధికారము చేతికివచ్చినా వారు తమ పాతయింటనే కాపురం చేస్తున్నారు. ఆ గృహంలో ఏనీ స్వయంగా కుట్టిన పతాలు, చమికీలు, యితర వర్ణచిత్రాలు అనేకంగా వున్నాయి. గృహకృత్యాలలో ఆరితేరిన మనిషి. భర్తకి తాను స్వయంగానే వండిపెడుతుంది. వంటలక్కని పెట్టుకోలేదు.

కుట్టుపనే సంసారులకు సౌఖ్యం యిస్తుంది అంది ఆమె ఒకసారి.

ఆటలలో వారికంత అప్యాయం లేదు. ఆమె కొన్ని సమయములందు పాడుతుంది తన మధురకంఠం ఎత్తి భర్త ఆనందంకోసం. అది అతడు మనఃపూర్వకంగా ఆశ్వాదిస్తాడు.

విందులలో ఆమెదుస్తులు డాబుగా ధరించదు. క్రింద ఒకగౌను, పైన నల్లటి జాకట్టు. నిరాడంబరత ఆమె దుస్తులలో ప్రస్ఫుటం అవుతుంది.

ఛేంబరలైను తన భార్యయొక్క ప్రేమ ప్రభావమును బహిరంగంగా అంగీకరించడానికి సందేహించడు. అతనిపైన ఆమెశక్తిని అతడు దాచిపెట్టడు.

అతడు చాన్ సిలర్ ఆఫ్ది ఎక్స్చెకర్ (ఖజానాదారుడు)గా నున్నప్పుడు బడ్జెటు దినమున ఒకసారి ఆమె వాని ఉపన్యాసమును తయారుచేసి పెట్టిందిట!

ఆదంపతులు ఉదయాన్నే చెట్టాపట్టాలు వేసుకుని సెంటు జేమ్సు పార్కులో తిరుగుట అనేకమంది ఎరుగుదురు. వొకసారి ఏనీ హాస్యంగా అందిట 'మీరు మీకార్యభారం మోయడానికి బలం చాలదు. వ్యాయామంచేస్తే మంచిది' అని.

భర్త భాగ్యసాలి అయినా బద్ధకంలేకుండా గృహకార్యాల్లో నిమగ్నురాలై వుండే ఆమె స్త్రీలోకానికి ఆదర్శప్రాయురాలు.





# రాజనగా యెవరు ?

- కిరీటధారియై, భోగభాగ్యములలో మున్గి తేలుచు, అధికారంధుడై నవాఁడు— రాజా ?
- ప్రజల కష్టనిష్ఠురములగు గుర్తించక పన్నులు వసూలుచేయుటయే ప్రధానముగ నెంచెడి స్వార్థపరుడు— రాజా ?
- దేశమెల్లెడల క్షామములు, ఆకలి యేడ్పులతో నిండియున్నను, చెవిటివానివలె నటించునట్టి కఠినాత్ముడు— రాజా ?

## కాదు!-కాదు!-

పేదలో పేద !—
కార్మికులలో కార్మికుడు !—
రైతులలో రైతు !—

శారదా రాయలసీమ ఫిలిమ్స్‌వారి

# జయప్రద లేక పురూరవ చక్రవర్తి!

తారాగణము :

| | | |
|---|---|---|
| సి. యస్. ఆర్ | ... | యశోద. |
| కుందా పిచ్చయ్య | ... | లలిత. |
| నరసింహారావు | ... | సంపూర్ణ. |
| బైరెడ్డి | ... | సూర్యకుమారి. |
| ఆంజనేయులు | ... | రాముడు. |
| కమాల్ | ... | శకుంతల. |
| ఖాదర్ రావు | ... | రాజకుమారి. |
| శ్రీరాముడు | ... | చిట్టి. |
| సోమప్ప | ... | శేషు. |

మాస్టర్ సూరి, సత్యం, పంపాపతి, ప్రతాప్.

డైరెక్టర్: చిత్రపు నరసింహారావు,

మ్యూజికల్ డైరెక్టర్: మాస్టర్ ఎస్. రాజేశ్వరరావు.



*For Bookings :*

**SREE SARADA RAYALASEEMA FILMS Ltd., (Cuddappah)**
**No 6, Harrington Road, Chetput :: Madras.**

పందితోక వండిపెడితే పిల్లలు బద్ధకంలేకుండా చురుకువారు అవుతారు

# వంటయింట్లో దెయ్యాలు

ఫిలిప్పయిన్ దీవుల్లోని వంటయింటి సంబంధమైన వింత ఆచారాలు : విడ్డూరపు నమ్మకాలు.

రచయిత :

## ఆర్. శ్రీరామమూర్తి, బి.యే.

వివిధదేశాల్లో వింతవింత విశ్వాసాలు వుంటాయి. అయితే వాటిని అన్నిటినీ ఒక్కచోట పేర్కొవడం కష్టం.

ఒక్కొక్క దేశంలో ఒక్కొక్క విషయంలో ప్రజల విడ్డూరపు విశ్వాసాలు ఎట్టివో వివరించడం తెలుపు – వినడమున్నూ సులువే.

కావున ఈ వ్యాసంలో ఫిలిప్పయిన్ దీవుల్లో వంటసంబంధమున్నూ, భోజనసంబంధమున్నూ అయిన వింత విశ్వాసాల్ని వివరిస్తాను. దయచేసి వినండి.

వండుకోడానికి ఆ దేశంలో ఒక పందికాని, మేకకాని చంపబడితే గృహయజమానురాలు ఆ జంతువు శరీరంలోని ప్రశస్తమైన మాంసం ముక్కల్ని కొన్నిటిని కిటికీలోంచి అవతలకు పారేస్తుంది.

పారేస్తూ నెమ్మదిగా 'రండి, ఇప్పుడు రండి' అంటుంది. దెయ్యాలువచ్చి ఆ మాంసాన్ని తింటాయి అని ఆమెనమ్మకం.

ఆ దెయ్యాలకు ఆ మాంసంముక్కలు పడేసి వాటిని ఆహ్వానించి ఆరగించమనకపోతే ఆ దెయ్యాలు వండినకూరనే ఆరగిస్తాయి. వాటికి ఆరగింపుఅయిన కూరను తరవాత ఇంట్లోవాళ్లు తింటే వాళ్ళకు కడుపునొప్పో, పెదవికి తొట్టో వస్తుంది.

ఫిలిప్పయిన్ దీవుల్లో వంటకత్తె అరచేతితో ఎప్పుడూ మాంసాన్ని కాని, ఆహారాన్ని కాని తట్టదు. ఎందుచేతనుఅంటే అరచేతితో అట్లా తట్టబడ్డమాంసం, ఆహారం కోపగించి తిన్నవాడి కడుపుకుపట్టి అజీర్తి రోగాన్ని కలిగిస్తాయి.

కొబ్బరికాయ కొట్టినపుడు లోపల కొబ్బరి పెంకుకు అంటివుండకపోయినా, నీళ్లునిండా లేకపోయినా వంటకత్తె ఆకాయను పారేస్తుంది. ఎందుచేతనంటే ఆకాయను తింటే బట్టతలఏర్పడుతుందనివారినమ్మకం.

బియ్యము మొదలయిన గింజల్ని ఫిలిప్పయిన్ దీవుల్లో ఇల్లాలు ఎప్పుడూ కాలితో తొక్కదు. తొక్కిన గింజల్ని తినదు. ఏమంటే ప్రతీగింజలోనూ దానిని తినేవారికి పుష్టిని ఇచ్చే దేవతవుంది. ఆ గింజను తొక్కేస్తే అందులోని పుష్టిదేవత కోపం తెచ్చుకుని ఆగింజను వదిలేసిపోతుంది. పైగా ఆగింజ తగిలినంతమేరా ఆమెపాదం పగులు చూపుతుంది.

అచ్చటి గృహిణి శాకానికి ఒక పెద్ద చేపను తరిగేటప్పుడు ఆ చేపయొక్క పెద్ద రెక్కల్ని ఒక స్తంభానికి అంటిస్తుంది. ఇల్లా అంటించడంవల్ల ఆమెభర్తకాని, ఆఇంటిలోని ఇతర మగవాళ్లుకాని వేటలో పెద్దపెద్ద చేపల్ని పట్టుకోగలుగుతారట.

ఫిలిప్పయిన్ ఇల్లాలు పొయ్యిదగ్గర పడుకోకూడదు, పాట పాడకూడదు. ఇప్పటి భర్త చనిపోయి ఆమె మారుమనువు చేసుకోవలసివస్తే ఆమె పొయ్యదగ్గర పడుకున్నదోషానికి, పాటపాడిన దోషానికి ముసలిమగడు వస్తాడు.

పెళ్లికాని పడుచులయినా పొయ్యిదగ్గర పడుకోకూడదు, పాట పాడకూడదు. పడుకున్నా, పాడినా పెళ్ళాన్ని పోగొట్టుకున్న తొర్రిపెదవుల తొస్సెన్న ఆమెకు మగడు

అవుతాడని వారి నమ్మకం.

ఫిలిప్పయిన్ దీవుల్లో ఇల్లాలు కిటికీలోనుంచి నీళ్లుబయటికి పోసేటప్పుడు ముందుగా 'పో, పో' అంటుంది. కిటికీకి అవతల దెయ్యంవుంటుందనీ, పొమ్మని ముందు చెప్పకుండా నీళ్ళుపోసినట్లు అయితే ఆ నీళ్ళు ఆదెయ్యంమీద పడతాయి అనీ, పడినట్లు అయితే ఆదెయ్యం ఆమె మూతిని వెంటనే వంకరపోగొట్టుతుందనీ వారినమ్మకం.

ఆపోసీనీళ్ళు వేన్నీళ్ళు అయితే ఆమె మరీ జాగ్రత్తగా వుండాలి. వేన్నీళ్ళు గనక దెయ్యంమీదపడితే ఆ ఇల్లాలికి జ్వరంరావచ్చు, కళ్ళుపోవచ్చు, లేదా ఆమె చనిపోవచ్చు. పోసిననీళ్ళు దెయ్యానికి కొద్ది బాధ కలిగిస్తే జ్వరం – అంతకంటె కొంచెం ఎక్కువబాధ కలిగిస్తే కళ్ళుపోవడం – బాగా బాధ కలిగిస్తే మరణం ఈమాదిరి శిక్షలు దెయ్యాలు విధిస్తాయి.

పొయ్యిలో పుల్లలు దోపేవిషయంలోకూడా కొన్ని విడ్డూరపు విశ్వాసాలున్నాయి. పొయ్యిలో పుల్లలు దోపేటప్పుడు చెక్కపేడు పెద్దమొన దోపాలి. అట్లా కాక చిన్నమొన, సన్నమొనగల వైపు చెక్కపేడు పొయ్యిలో పెడితే ఆమెకు పుట్టేపిల్లలు తల్లకిందులుగా పుడతారు. పిండం తల్లకిందులుగా పుడితే తల్లికి బిడ్డ నొప్పులబాధ విస్తారంగా వుంటుంది.

ఫిలిప్పయిన్ దీవుల్లో ఇల్లాలు వెదురుకర్రలు వంటకట్టెలుగా ఉపయోగించదు. ఉపయోగించినట్లు అయితే ఇంటికప్పుమీదనుంచి రాత్రిళ్లు జెర్రెలు రాలతాయి అని ఆమె విశ్వాసం.

కొబ్బరిఈనెల చీపురుతో రాత్రి భోజనాలు అయాక ఇల్లు తుడిచినా పైనుంచి ఇంట్లో జెర్రెలు రాలతాయి అని ఫిలిప్పయిన్ స్త్రీల నమ్మకం.

పాతపడిపోయిన నిచ్చెనముక్కలుకూడా ఆమె వంటకట్టెలుగా వాడదు. వాడినట్లు అయితే ఆమె తండ్రి, మగడు, సోదరులు హంతకులు అవుతారట.

వంట జరుగుతూవుండగా కుండ అడుగు భాగాన్ని మినుకు మినుకుమనే వెలుతురుమిణుగురులు కనిపిస్తే త్వరలోనే వంటయింట్లోకి చాలా చేపలు వస్తాయి అన్నమాట. అట్లా వెలుతురుమిణుగురులు కనిపించకపోతే ఆమె ఇంట్లోకి కిట్టనిచుట్టాలు ఎవరోవస్తారు.

కొత్తకుండ మొదటిసారి వంటకు ఉపయోగించేసందర్భంలో బియ్యం ఉడకడానికి ముఖస్థమైనప్పుడు వంటకత్తె కుండను ఏవోమాటలతో భయపెడుతుంది. అట్లా భయపెట్టడంచేత రోజూ ఆకుండ అన్నాన్ని శీఘ్రంగా వండుతుంది.

ఆ కుండలోనుంచి అన్నం తీసేటప్పుడు ఆ కుండను ఒక కంచంలో ఆమె బోర్లించదు, ఊగిసలాడించదు, కుండలో తనచెయ్యి పెట్టదు. పెద్దగరిటినో, తెడ్డునో వాడుతుంది. గరిటిగాని, తెడ్డుకాని ఉపయోగించడంవల్ల కొత్తకుండ సదా మం అదృష్టాన్ని తెస్తుందని అచ్చ వారినమ్మకం.

అన్నం కుండలోనుంచి ఆక ఎప్పుడు కాని అన్నాన్ని అంతా తీ వేయదు. అంతో ఇంతో అడుగు అన్నం మిగులుస్తుంది. అట్లా మి ల్చడంవల్ల ఆకుండలోవండిన అన్న ఎప్పుడూ తరిగిపోదని ఆమెయొక్క విశ్వాసం.

ఇల్లాలువండే అన్నంలో నీ ఇగిరిపోయిన తరువాత మెతుకు ఇంకా బిరుసుగానేవుంటే ఆమె బిరుసుతనం తగ్గడానికి చెక్క పే మీద కొద్దిగా ఉప్పు చల్లుతుంది మెతుకులమీదకూడా ఉప్పుచల్ తుంది– లేదా మూతమీకుడిమీ చల్లుతుంది.

ఆమె ఎప్పుడుకాని ఉప్పుకల్ల పార వేయదు. పారవేసినట్లు అ తే మరణసమయంలో విచారగ్రస లయిన తన కుటుంబంవారు ఎం చేసినా, ఏమిచేసినా తనకళ్లు మూ తలుపడవు.

వంటసమయంలో ఆమె ఉ యోగించే కర్ర తెడ్డు గట్టిదై వుం విషయంలో ఆమె మెలుకువ వహి స్తుంది. ఏమంటే చీకు తెడ్డుతో అన్నం కలియబెడుతూవుండగా అ విరిగిపోయినట్లు అయితే ఆమె ఒ సారి ఇల్లువదలి బయటికి వెళ్లినప్పుడ ఆమెకు తప్పక ఏదో ప్రమాద కలుగుతుంది.

ఎవర్నికొట్టడానికగాని తెడ్డు ఉ యోగించకూడదు. ఏమంటే తెడ్డ

ో దెబ్బతిన్నవారి ముఖం కొద్ది ోజుల్లో అందవికారంగా మారుంది, లేదా వెర్రిపడుతుంది; పై - మరణకాలంలో వారిముఖం ల్లబడిపోతుంది.

భోజనపుబల్లకి ఇరుపార్శ్వాలా మానసంఖ్యవారే భోజనానికి గార్చోవాలి. ఈవిషయాన్ని వారు మనించకుండా తప్పినడిస్తే ఈ ెరి వారు పడవప్రయాణం చేసేప్పుడు పడవతప్పకుండా బోల్తా ొట్టేస్తుంది.

భోజనం చేసేటప్పుడు ముద్ద నోకి అందించుకొనే సమయంలో ల్లాలి చేతిలోనుండి ముద్దజారిపోతే మె ఆముద్దను దెయ్యానికి ఆహాంగా కిటికీలోనుంచి బయటికి ోసేస్తుంది. తింటూవున్న ముద్ద ారిపోయినదానికి అర్థం ఆమె తింనిచూసి దెయ్యంఒకటి అసూయడుతూ వుందన్నమాట. అసూయడుతూవున్న దెయ్యాన్ని తృప్తి రచకపోయినట్లయితే అది తప్పండా హానికలిగిస్తుంది.

వంటకుండమీాది అన్నపుఅట్ట ొరకలు పిల్లలకు పెట్టకూడదు. ఁడితే వారికి బద్ధకం బలిసిపోతుం - త్వరగా ముసలితనంవారిని ుంచేస్తుంది.

అన్నపు అట్టతొరకలకు బదులు ల్లలకు ఏమిపెట్టాలి? కోడిపిల్ల తల ాయకాని, పందితోక ముక్కా ాని వండిపెట్టాలి. కోడిపిల్ల తల ాయ గనక వండిపెడితే తెల్లవారగట్లనే లేచి కూతకూసే కోడిలాగే పిల్లలుకూడా పెందరాలే లేచేవారు అవుతారు. పందితోక ముక్కా వండిపెడితే పందితోకలాగే పిల్లలుకూడా అస్తమానూ కదులుతూ బద్ధకంలేకుండా పనులు చేసేవారు అవుతారు.

అన్నం తింటూవుండగా ఫిలిప్పయిన్ దీవుల్లో స్త్రీ పెదవికాని, నాలుకగాని కరుచుకుందంటే ఆమెనుగురించి ఇతరులు చెడుమాటలు చెప్పుకుంటున్నారన్నమాట.

ఆమె నీళ్ళుతాగేటప్పుడు గనక ఆమెకు పొలమారితే ఆమెను ఎవరో ప్రేమహృదయంతోనూ, మంచి మనస్సుతోనూ తలచుకొంటున్నారని ఆమె అనుకుంటుంది.

ఫిలిప్పయిన్ వంటయింట్లో పింగాణీకంచం వొకటి పొరపాటున పగిలిపోతే బుద్ధిపూర్వకంగా మరో కంచాన్ని దానికి జతకోసం పగలకొట్టేస్తారు. అల్లా పగలకొట్టకపోతే ఆ కంచానికి జతవుండడానికిగాను ఆకుటుంబంలో వొకరు చనిపోతారట.

పెళ్లిఅవని ఒక యువకుడుకాని, పడుచుకాని ఇంకా అన్నం తింటూవుండగా ఆపంక్తిలో వారికంటె ముందుభోజనం చేసేసినవారు కంచాలు తీసివేయకూడదు; వాటిని పక్కకు తోసివేయకూడదు.

తీసివేసినా, తోసివేసినా కూడా భోజనం చేస్తూవుండిన యువకులికి, పడుచులికి పెళ్ళికాదు. ఫిలిప్పయిన్ దీవుల్లో పెళ్ళికాక పోవడమంటే గొప్ప ఆపద; గొప్పఅవమానం.

పదకొండుసారులు కట్టబడ్డ ఢిల్లీపట్టణం ప్రతివేసవిలో పాడుపడుతుం

# వైస్రాయి వేసవియాత్ర

"విశేషవ్యయకారణమైన వైస్రాయి వేసవియాత్ర, వేసవివిడిది మనపేద దేశపు నెత్తురుచుక్కలవంటి ధనరాసులను ఎన్నిటినో ఏటేట కబళిస్తూ వున్నాయి. కాగా అవి మనకు సంతోషకారణం ఎట్లా అవుతాయి?"

రచయిత:

## జి. వెంకటరావు, బి.యే.

ఫాల్గుణమాసంతోటి శిశిరఋతువు పరుగెత్తుకుపోతుంది. చైత్రమాసంతో వసంతఋతువు ప్రారంభమౌతుంది.

అందుతో వృక్షజాతికి కూడా కొత్తజీవితం ప్రారంభం. ఇండియా వైస్రాయి కొత్తప్రదేశానికి వెళ్ళడానికి ఆయత్తుడౌతాడు.

ఢిల్లీ నుండి సిమ్లాకొండలకు వేసవియాత్ర సేవిస్తాడు ఇండియా వైస్రాయి. ఈయాత్రలో ఒక్క ఇండియావైస్రాయి ఏనా లేక ఇతతులు ఎవరైనా పాల్గొంటారా?

ఓ, కావలసినంతమంది పాల్గొంటారు.

సర్ ఎడ్విన్ లెటేన్సు హైందవ సామ్రాజ్యానికి న్యూఢిల్లీని కట్టిఇచ్చాడు. ఢిల్లీ కొత్తగా నిర్మించడానికి ఇది పదకొండోసారి. అనగా హిందూదేశపు రాజధానీనగరమైన ఢిల్లీమహానగరం ఆయా కాలాల్లో పదకొండుసారులు క్రొత్తగా నిర్మింపబడుతూ వచ్చిందన్నమాట.

అలగ్జాండరుకాలంనుంచీ ఢిల్లీ విదేశీయులకు బాగా తెలిసిన పట్టణమే.

మొగలాయీ సామ్రాజ్య సంస్థాపకుడు బేబరుచక్రవర్తి కాలంలో ఢిల్లీ జనాకీర్ణమూ, ధనవంతమూఐన పట్టణరాజ్యమై వుండెను.

ఢిల్లీలో వొక్కొక్కరాజధాని సగటున నూరేసి సంవత్సరాలే ఉంటూవచ్చింది. ఇల్లా ఎందుకు అవుతూవచ్చిందంటే హిందూదేశంలోనే ఎవరూ ఏమీచెప్పలేరు.

వొక్కొక్క కాలంలోనూ కట్టబడ్డ ఢిల్లీరాజధానుల మందిరాలు మాత్రం ఇప్పటికీ ఆ మహానగరం యొక్క ప్రాక్తనవైభవాన్ని ప్రకటిస్తూవుంటాయి.

ఇండియాలో బ్రిటిష్ప్రభుత్వానికి ఢిల్లీ కాక మరో రాజధానికూడా ఉన్నది. ఆ రెండో రాజధాని వేసవికాలానికి. అదే సిమ్లాకొండల రాజధాని.

సిమ్లా ఎనిమిదివేల అడుగుల ఎత్తునవున్న కొండలమీదవుంది. ఢిల్లీనుండి సిమ్లాకు ఏటేట వేసవి

లో ఇండియాప్రభుత్వం మార
వుండడం ఎంతటి వ్యయకారణ
వొక ఊరుఊరు లేచి మరో
టికిపోయి కొంతకాలంవుండి
డంఅంటే ఎంతటికష్టం?
హిందూదేశంవంటి పేద
లో ప్రాభవంఅంతా ప్రభు
మందిరానికే అంటుకుని వుంటు
అందుచేత ఆ ప్రభుత్వం — కొ
కాలమే అగుగాక—వొకవూ
విడిచి పోతుందంటే ఆప్రభుత్వ
బాటు ఆవూరిలోవర్తకం, వా
రంకూడా ఆవూరునువిడిచి—
త్వంపోయే కొత్తచోటికి పోతా
ఇంతకీ తాత్కాలికంగా
వేయబడే న్యూఢిల్లీలోని మం
లు ఎట్టివి? వైస్రాయి నివాసవ
రం—లెజిస్లేటివ్ అజెంబ్లీభవన
కౌన్సిల్ ఆఫ్ స్టేట్మందిరం—
ద్రమండలికార్యాలయ మంది
బ్రహ్మాండమైనవి. పైగా సె
రియట్ మందిరాలు. వాటిచు
మైళ్ళకొద్దీ వ్యాపించివున్న తె
బంగాళాలు. ఆ బంగాళాలు
టేరియేట్ ఉద్యోగులనిమిత్తం.
వేసవిసూచనలు పొడసూ
వొకనాడు హఠాత్తుగా వైస్రా
ఆర్డరు పుడుతుంది—వైస్రాయి
మ్లాకు వెళ్ళనున్నాడని.
ఆ ఆర్డరు పుట్టడంతోటే ఆ
రికార్డులన్నీ పాకేజీపెట్టెల్లోకి
తాయి. వైస్రాయితోబాటు
కేజీపెట్టెలున్నూఢిల్లీని వదలి సిం

ళ్ళడానికి తయారు అవుతాయి.

వెళ్ళడానికి ముందు కొద్ది రోజు రా—వెళ్లే రోజుల్లోనూ—వెళ్ళిన రోజుల్లోనూ ఆఫీసు రికార్డుల నం ఉద్యోగస్థులకు దొరకదు. ప్రధాన కార్యదర్శులు కొందరు గ్రాములు ఇచ్చి, ఉత్తరాలు పే ముఖ్యమైన ఫైల్ కాగితా అడుగుతారు. అందరికీ వొక్క ప్రత్యుత్తరం—ట్రాన్సిట్‌లో యాణంలో) వున్నాయి అని.

మ్యాఢిల్లి సెక్రటేరియట్ అం వొక్కసారి సిమ్లాకొండలకు రడమంటే ఫైల్సుకొండలు రవాణా చేయవలసివుంటుందో సారి ఊహించండి.

ఉద్యోగులు పోయేదానికి కొన్ని రాల ముందుగానే ఎద్దుబళ్ళు ఢిల్లీ సెక్రటేరియట్ భవనం రైల్వేస్టేషన్‌కు వస్తూపోతూ హాయి. స్టేషన్‌లో స్పెషల్ ట్రై న్‌లు కాచుకునివుంటాయి. వా కి ఈఫైల్సు, దస్త్రాలు వొక మీద వొకటి దొంతర్లుగా తాయి.

ఫారిన్ డిపార్టుమెంటు—పొలిటికల్ డిపార్టుమెంటు మున్నగు ఏభై డిపార్టుమెంటుల ఫైల్సు ఢిల్లిరికార్డురూముల్ని వదిలి షల్ ట్రెయిన్‌లను ఎక్కుతాయి. చెమటలో స్నానంచేస్తూ రోజు టూ కూలీలు బళ్ళమీదనుంచి కేజీపెట్టెల్ని స్పెషల్ ట్రెయిన్ గాదికి ఎక్కిస్తారు. ఇంతశ్రమకూ కూలీలకు దినానికి ఎనిమిది గాలే కూలి.

ఫైల్సుతో చెక్కపూతైన పాకేజీ పెట్టెలు—ప్యాకేజీ పెట్టెలతో చెక్కపూతైన స్పెషల్ ట్రెయిన్‌లు! వైస్రాయి వేసవియాత్రఅంటే ఇది అర్థం.

ఆస్పెషల్ ట్రెయిన్‌లు నేరుగా సిమ్లా పోవడానికి అవకాశంలేదు. కల్కాస్టేషన్‌లో ఆ ప్యాకేజీ పెట్టెలగుట్టలు రైలుబళ్ళను మారాలి. ఢిల్లీనుంచి కల్కావరకు బ్రాడ్ గేజ్ లైన్—కల్కానుంచి మీటర్ గేజ్. ఈబళ్ళు మారడంలో మరికొంత కాలహరణం—గాడిదగత్తర.

రికార్డు రూముల్లోని రేక్‌లమీదనుంచి దస్త్రాల్లోకి—దస్త్రాల్లోనుంచి పాకేజిపెట్టెల్లోకి ఫైల్సు అదృశ్యంఅవుతాయి.

ఇక ఆపాకేజీపెట్టెలు కూలివాళ్ళ దొల్లింపులతో ఆఫీసు వరండాలలోనుంచి బళ్ళమీదికి—బళ్ళమీదనుంచి బ్రాడ్ గేజిరైలుమీదికి—బ్రాడ్ గేజి రైలుమీదనుంచి మీటర్ గేజిరైలుకు—ఆ రైలుమీద సిమ్లా కొండలకు ప్రయాణంచేసి సిమ్లాలో పొట్టలువిప్పుతాయి.

తేలుకడుపు చీల్చుకుని పిల్లలు వచ్చినట్లు ఆపేకేజీపెట్టెల్ని చీల్చుకుని ఫైల్సు బయటికివస్తాయి. ఆ సమయంలో అక్కడ ఉండేహడావుడి పెళ్ళి హడావుడి కంటేనూ—వుండేగోల సంతగోలకంటేనూ ఎక్కువై వుంటుంది.

జలతారు తలపాగాలు పెట్టుకుని—ఎర్రకోట్లుధరించి చాప్రాసీలు—వివిధ డిపార్టుమెంటులకు చెందిన దఫేదారులు—పేకేజీపెట్టెలు పొట్టలు విచ్చడంతో తమతమ డిపార్టుమెంటు కాగితాల్ని తీసుకోడానికి ఒకళ్ళని ఒకళ్లు తోసుకుంటూవస్తారు.

పాపం! వాళ్ళకు చదువురాదు. దస్త్రాలమీద అంటించబడ్డ చీటీలు చదువుకుని ఏదస్త్రం ఏడిపార్టుమెంటుదో తెల్సుకునేజ్ఞానం వారికిలేదు. అందుచేత ఏదో అనమానాలును పట్టి ఆదస్త్రం తమదని వారు అనుకుని వొకరిచేతుల్లోది వొకళ్ళు లాక్కుంటారు.

ఆదృశ్యం హాస్యజనకంగావుండి ఆనందం కలిగిస్తుంది.

ఇంతకీ వైస్రాయి వేసవియాత్రలో ఆనందింపదగ్గ దృశ్యం అది వొక్కటే ఏమో!

విశేషవ్యయకారణమైన ఆ వేసవి యాత్ర, వేసవి విడిది మన పేద దేశపు నెత్తురుచుక్కలవంటి ధనరాసులను ఎన్నిటినో ఏటేట కబళిస్తూవున్నాయి. కాగా అవి మనకు సంతోషకారణం ఎట్లాఅవుతాయి?

తమ పై ఉద్యోగుల దస్త్రాలకోసం వొకళ్ళతో వొకళ్లు రాపాడుకోనే, తోపుళ్లాడుకునే చాప్రాసీల మూలంగా మనకు కలిగే హాస్యసంబంధమైన ఆనందమైనా లోతుగా ఆలోచిస్తే దుఃఖించతగిందే. ఆ చాప్రాసీల అవిద్య, అజ్ఞానం విచారించతగినవికాని హాస్యానికైనా వినోదింపతగ్గవికాదు.

ఇక అయితే వైస్రాయి వేసవియాత్రలో వినోదింపదగ్గ విషయం ఏముంది?

విచారింపదగ్గ విషయంలో వినోదవిషయం ఏమి దొరుకుతుంది?—

పెద్దదిక్కు లేకపోతే ఎద్దుబుర్ర తెచ్చిపెట్టుకోమని శాస్త్రంచెబుతోం

# ముసలితనం కావాలి

"ముసలితనం పైబడ్డకొద్దీ మనకు మేధాశక్తి ఎక్కువౌతుంది. మేధాశక్తి ఎక్కువ కావాలంటే ముసలితనాన్ని కోరుకోవాలన్న మాట."

రచయిత :

'కాశ్యప'

ముదిమి కన్నను చేటు భువిని లేదట. కాస్తజుట్టు నెరిసిందంటే చాలు 'తాతా' అనేస్తారు. యిట్టే పళ్లు వూడితే అవ్వదరికి ఏ మనుమడూ చేరడు. ముసిలికంపంటాడు.

ఏభై ఏళ్ళు సమీపించేసరికి ఎందుకూ పనికిరాడని వుద్యోగంలో నుంచి విరమించమంటారు. అయితే ఏభై ఏండ్లకే ఆతని మెదడు మొద్దుబారుతుందా?

రాజకీయాల్లో వేలుపెడదామంటే యిది యువకులకాలం. వృద్ధులు నాయకులుగా పనికి రారంటారు.

పూవులను మధుపములు ప్రాతఃకాలమందు దర్శించినంతజోరుగా సాయంకాలాన చేరవు. ఎంచేత? వాటికాలం అయిపోయింది కనుక, ముదిమామిడిచెట్టుగాని, చింతచెట్టుగాని కనుపిస్తే ఏవో దెయ్యాలు వుంటాయి ఆచెట్టుమీద అంటూ దరిచేరరు ప్రజలు. పాతఆవకాయ డొక్కు ముసలిభోగందీ—చాలా కుషీగావుంటాయి అని చెప్పినా ఏ రసికుడు ముసలమ్మ దగ్గరికి వెళ్ళడు: లంజా, ముంజా లేతగానే వుండాలంటారు.

మానవునికి ముసలితనం ఎందుకు వస్తుంది? అహంచేత. తను తన సంసారము అనే ఆశచేత కలుగుతుంది. స్వార్థత్యాగులు ఎప్పటికీ యువకులుగానే వున్న విషయములు మనం అనేకం చదువుతున్నాం; చూస్తున్నాం.

వర్తకంలో డబ్బుపోయిందనో, డబ్బులేక సంసారంగడవకనో చింతాజ్వరం పట్టుకుంటుంది. దాంతో శరీరంలో పటుత్వం పటాపంచలైపోతుంది. ఏనుగులాంటి మనుష్యులు పీనుగులైపోతారు.

బక్కచిక్కినఎద్దుకి గడ్డి పడేసేవాడు ఎవడు? ఏదైనా వృ వుండి పనిచేసేదానికే దానా తారు. మానవసంఘం క అంతే?

అందుకే మనపూర్వులు ఒ నం వుడిగిన వెంటనే అరణ్యానిక మ్మనారు. తపస్సు చేసుకోమ రు. అంటే సంఘానికి ముస ళ్ళబాధ పోగొట్టడానికి వారిని వులలో తిరిగి ఏ పులినోటనో ప న్నారు అనుకుంటాను.

మనపూర్వులు తాము పార్జించిన విజ్ఞానం ముసలితన ప్రజలకు యియ్యకుండా అరణ పట్టారు కనుకనే మనం ఈ ఈస్థితిలో ఉన్నాము.

మానవుని మేధాశక్తి ముప్పదే ఏట ఎంతచలాకీగా పనిచేస్తు అరవయ్యో ఏటకూడా అంత కాకీగానే వుంటుంది. మెదడు గున్ననాడు సాధారణముగా శ కూడా బాగుంటుంది. ముసలి లో చలాకీగాపనిచేయుటే జాగ్రత్తగా ముందువెనుకలు లోచింపగలశక్తి వుంటుంది. క గడిచినకొద్దీ అనుభవం వంటబ కొద్దీ ధీశక్తి ఎక్కువఅవుతు దానినే నిదానంఅంటాం.

తొస్సిపళ్ళతో, ముడతలశ తో చమటకంపుతో జీవించి దేవాళ్ళకన్నా ఎందరో లేచనిప నవారు దైవభక్తులనడం మన

ఘా ఎరుగుదుము.

భగవంతుడు ఎవరినైతే ప్రేమి
ో వారు పెందరాళే చనిపోతా
ారు. కాని దానిఅర్థం అది
ప. భగవంతునిభక్తులు అంటే
త్యాగులు, నిత్యయవ్వనులూ
ాను.

అరవై ఏళ్ళువచ్చాక చదువు
మన్నుకొట్టుకుంటూనా అనే
్తివుంది మనలో. కాని అది
కాదు. చదువుకొనుటకు కుర్ర
మే శ్రేష్ఠమైననా, పెద్దవాళ్లు
వుకుంటే త్వరగావస్తుంది. కు
ానికి ధారణాశక్తివుంటే ముసలి
కి గ్రహించేశక్తి ఎక్కువగా
ుంది.

శమయొక్క పరిశ్రమచే దేశా
సేవచేసినవారందరూ చాలా
ూ వృద్ధులే; ఏభై ఏండ్ల దరి
ువారే. 'గాలిలియో' తన
వ ఏటనే చంద్రమండలము
ార్చిన పరిశోధనవెగ్గిలో దా
వెల్లడి చేశాడు.

నేడు విద్యుచ్ఛక్తి ఎక్కడచూ
కనుపిస్తోంది. దానికి ఆద్య
స్త్ర 'వోల్టు' మహాశయుడు.
ు దానిని 54-వ ఏట కని
ాడు.

ఆసుపత్రులలో నేడు విరివిగా
యోగింపబడే ఎక్సరేను రాన్
న్ అనువాడు ఏభైయ్యోఏట
ంసుక్కొన్నాడు. విక్టర్ హ్యూ
'లా మిజరబుల్' అను గ్రం
్న అరవై ఒకటవఏట వ్రాశా
డు. టిటియాన్ అను చిత్రకారుడు ఎనభై మూడవయేట గొప్పచిత్రం వ్రాసాడు.

పోలెండు స్వతంత్రరాజ్యానికి మంత్రిగా వుండమని పడర్విస్కీని కోరారు. నాటికి అతనికి షష్టిపూర్తి అయింది కాని అతిచాకచక్యంగా కార్యనిర్వహణం చేసాడు. అతని జీవితాంతంవరకు అతడు పేరుపొందిన నాయకుడై వుండెను.

అరవైతొమ్మిది ఏండ్లవాడైనా గాంధి అతిశ్రమతో దేశమునకై సేవచేయుచున్నాడు. ఆ గాంధి లేకపోతే కాంగ్రెసే లేదు.

మొత్తంమీద యీ ప్రకృతిలో అన్నీ—చెట్టు, చేమ, పిట్ట, జంతువు, అన్నీ—ముసలితనాన్ని చవిచూడవలసినవే.

చెట్టు పెద్దదైతేనేకాని కాయదు. దానిఫలాని కాసించి దాని వృద్ధి కోరుతాము. అంటే అది ముసలిది కావాలని కోరుతాము.

ఏదేనా వర్తకసంస్థ స్థాపిస్తే దానికి రోజులుగడిచిన కొద్దీ ఘనత ఎక్కువ. ఆ సంస్థలోని ప్రజలు ఏభైఏండ్లునిండాయి అని చెప్పుకోడానికి సంతసిస్తారు.

పెద్దదిక్కు లేకపోతే ఎద్దుబుర్ర తెచ్చి పెట్టుకోమని శాస్త్రంవుంది.

ఇక మనకు ముసలితనంచూస్తే అసహ్యం ఎందుకు? మొత్తంమీద ముసలివాళ్ళకు మేధాశక్తి ఎక్కువ అని ఒప్పుకోవాలి. కాబట్టి మన మేధాశక్తి ఎక్కువ కావాలంటే మనం ముసలివాళ్ళం కావడాన్ని కోరుకోవాలన్నమాట.

ముసలితనమా! నీకు సుస్వాగతం.

ర్తిగా తెరచి అక్కడే నిలుచుండి 'నీవు చాలామోటగా ప్రవర్తిస్తున్నావు. నిన్ను ఇకమీద ఎప్పుడు కాని చూడకుండావుండాలని నేను కోరుతున్నాను' అని అంది. ఆసమయంలో ఆమెకళ్లు చింతనిప్పుల్లాగున ఎర్రగావున్నాయి; ఆమె అధరాలు అతిశయంగా స్పందిస్తూవున్నాయి.

'అల్లాఅయితే తలుపుఎందుకు తీశావు?బయటికి ఎందుకు వచ్చావు? నాముఖం ఎందుకు చూశావు?' అని కుటిలంగా, కొంటెగా ప్రశ్నించాడు. అతనికళ్ళల్లో ఆసమయంలో ఏదో వింతకాంతి ప్రకాశిస్తూవుంది. అతను ఇంకాఅన్నాడు. 'ఓడఅధికారులకు ఫోనుచేసి నన్ను పంపించివేసి వుండవలసింది. ఏదో శృంగారదృశ్యం అవుతుందని నీవు భయపడి వుంటావనుకుందామనుకోడానికిన్నీ వీలుకనిపించదు. ఏమంటే, అట్టి శృంగారదృశ్యాలకి నీవు బాగా అలవాటు పడేవున్నావు. పదహారుఏళ్ళదానవు అయినప్పటినుంచీ నీకిట్టి శృంగారదృశ్యాలు అలవాటేకదా! ఇప్పుడు నీకు పందొమ్మిది ఏళ్లువుంటాయి అనుకుంటాను. ఈమూడు ఏళ్ళల్లోనూ నీవు ఇట్టి శృంగారదృశ్యాల్లో ఎన్నింట్లో పాల్గొన్నావో.'

ఇట్లా అంటూ అతడు ఆమెముఖంకేసి తేరి పారచూశాడు.

'నాకు ఇప్పుడు ఇరవై రెండో సంవత్సరం.' అంది ఆమె.

'ఆరు సంవత్సరాల మోహవిభ్రాంతి. వలపుజ్వరం నిన్ను అతిగా బాధించివుండాలి.'

'అవును.' ఆమె అరిచింది. అప్పుడు ఆమెముఖం కోపఘూర్ణమైంది. 'ఏదోఖర్మం జాలక నాపూర్వపు వృత్తాంతమంతా నీకు చెప్పివేయడంమాత్రాన్ని నేను అస్తమానూ పూర్వవృత్తాంతాన్ని గురించే మాట్లాడుకుంటూ వుండాలని అభిలషిస్తానని అనుకోకు. దయచేసి నాపూర్వవృత్తాంతాన్ని నన్ను మరిచిపోనియ్యి.'

౧౧

ఇట్లా మాట్లాడుకుంటూనే వారు ఓడపైభాగంమీదికి వెళ్లారు. అప్పుడు అతడు ఆమెను ఒకపెడగా తీసుకువెళ్లాడు. చాలాసేపు అతడు మౌనంగానేవున్నాడు. ఆ పిమ్మట అతడు వున్నట్టుండి హఠాత్తుగా వంగి ఆమెను ముద్దుపెట్టుకున్నాడు.

సుగాత్రి నిర్ఘాంతపోయి ఎగ ఊపిరి తీసింది. తన హస్తద్వయాన్ని అతని గుండెలమీద ఆన్చి ఆమె అతణ్ణి గెంటివేసింది. పైగా అంది 'ఎంత సాహసం! నీవు ఎంత తుంటరివి!' అని—

'నీకు ముద్దులు కొత్తకాదు. అవునా? ముద్దుఅంటే నీకు...'

రుచీదేవి చెప్పిన హితవచనాలు ఆమె హృదయకుహరంలో ఒక్కసారి గింగురుమన్నాయి.

'నీయందు విశ్వాసంవుంచి నా పూర్వచరిత్ర నీకు చెప్పినంత మాత్రాన్ని నా శరీరాన్ని చులకన చేయవచ్చుననే భావంతో నీవు వుండవద్దు. నాసంగతి నీతో చెప్పుకోవడంలో నేను చాలా పొరపడ్డానని నా అభిప్రాయం. నన్ను బాగా అర్థంచేసుకుని...'

'క్షమిస్తాననుకున్నావు. అంతేనా, నీవు అనుకున్నది? ఒక స్త్రీ యొక్క పూర్వవృత్తాంతాన్ని పురుషుడు ఉదారహృదయంతో మన్నింపగలడా అనే సంగతి పరీక్షిద్దామనుకున్నావు...'

'అట్టి ఉదారబుద్ధి ఏపురుషుడికీ వుంటుందని నేను ఇపుడు అనుకోను. నన్ను వెళ్ళిపోనియ్యి. ఇక ఎప్పుడు కాని నీవు మళ్ళీ నాతో మాట్లాడవద్దు.'

ఆమాటలకు బదులుగా భరద్వాజుడు తన రెండుచేతులతో ఆమెను దగ్గరకు తీసుకున్నాడు. గాలిలో తీగలాగ కంపిస్తూవున్న ఆమెశరీరాన్ని గాఢంగా కౌగలించుకున్నాడు. మృదువుగా, మధురంగా ఆమెను ముద్దుపెట్టుకున్నాడు.

౧౨

'సుగాత్రీ! నీ పూర్వకథను పట్టి—ఆకథను నీవు అంతధైర్యంగానూ, తెంపరితనంతోనూ వెల్లడించావు కాబట్టి నిన్ను నేను ప్రేమిస్తున్నాను. గాఢంగా ప్రేమిస్తున్నాను. నీకు తెలుసా? ఈసరికి నీకు తెలిసివుండాలి. మనం వెంటనే వివాహం చేసుకుందాము.'

'వివాహం!'

'అవును. వివాహం. నీపూర్వపు పతనాన్ని వినికూడా నిన్ను పెళ్ళి చేసుకోడానికే నిశ్చయించాను. గతాన్ని మరిచిపోదాము. ప్రాణాలతో నీకు జన్మాంతరం వచ్చిందనీ-నీవు సంస్కారాన్ని పొందావనీ—మన దాంపత్యం అనుకూలంగా వుంటుందనీ నా అభిప్రాయం.'

తల్లి చంకకు ఎక్కిన పిల్లలా సుగాత్రి సంతోషించింది. 'నీవు నన్ను ప్రేమించావు, నాపూర్వ వృత్తాంతం ఎట్టిదైనా నన్ను పెళ్లాడ్డానికి నిశ్చయించావు, కదా?'

సుగాత్రి ఆప్రశ్నకు జబాబుగా అతడు ఆమెకు ముద్దుపెట్టాడు. మళ్ళీ ఒకముద్దుపెట్టాడు. తరువాత చెప్పాడు. 'అవును. అంతే. మనం ఎప్పుడు పెళ్లాడుకుందాము?'

'ఈశీతాకాలంలో'

'మనం కలకత్తాలో ఓడదిగిననాడో, లేకపోతే ఆమరునాడో చేసుకోవాలని నాతలంపు.'

'అంత త్వరగా కాదు. నీసంగతి నాకు ఇంకా పూర్తిగా తెలియదు.'

'మనలాగ ఒకర్ని ఒకరు తరుచు ముద్దుపెట్టుకునేస్థితికి వచ్చేసరికి యువతీయువకులు ఒకర్ని ఒకరు బాగా తెలుసుకుని వుంటారని నా అభిప్రాయం. పైగా, నాకో భయం వుంది. నిన్ను ఒంటరిగా వదిలిపెట్టడానికి నాకు సంకోచంగావుంది. నిన్ను ఒంటరిగా వెళ్ళనీయడం నీ పూర్వచరిత్రనుపట్టి అంతమంచిది కాదనుకుంటాను.'

'నాపూర్వచరిత్రను నీవు నాకు తరుచుగా జ్ఞాపకంచేస్తూ వుండకూడదు' అని సుగాత్రి అభిమానవతిగా మాట్లాడింది.

'నేను జ్ఞాపకంచెయ్యను. కాని నీపూర్వచరిత్రవుండే అదిమాత్రం అతిఘోరమైంది' అని అతడు రెండువాక్యాలు పలికాడు. ఒకటి వాగ్దానం—రెండోది...

హఠాత్తుగా సుగాత్రి ఒకపని చేసింది. భరద్వాజునివద్దకు పరుగెత్తుకునివెళ్ళి తన బాహులతల చేత అతనికంఠాన్ని పెనవేసుకుంది. 'ఈప్రపంచంలోకి అల్లా ఆరాధ్యనీయుడవైన పురుషుడవు నువ్వు ఒక్కడవే. నీవు నావాడవు అయినందుకు నాకు చాలాగర్వంగా వుంది.' ఈమాటలుపలికి ఆమె అతణ్ణి చిక్కగా ముద్దుపెట్టుకుంది. ఓడపైభాగాన్నుంచి దిగిపోయి చరచరా తనగదిలోకి వెళ్లిపోయింది.

## ౧౩

భరద్వాజుడు కడకంటా ఆమె వెంటపోలేదు. మెట్లవరకు వెళ్లాడు. మళ్లీ ఏమనుకున్నాడో తిరిగి ఓడ పైభాగంమీదికే వెళ్లిపోయాడు. పడకకుర్చీలో కూర్చుండి సిగరెట్టుమీద సిగరెట్టు తగలెయ్యడానికి ప్రారంభించాడు.

నిశితదృష్టిగలవాడు ఎవడైనా అప్పుడు అతణ్ణి చూడగలిగివున్న

ట్లయితే అతనిముఖంమీద అలతి నవ్వు రేఖలు, కొంటెనవ్వు రేఖలు ముద్రితమైవుండడం గుర్తింపగలిగి వుండేవాడు. నిస్తరంగమైవున్న ఆ అపారపారావారాన్ని అతడు అనిమేషదృష్టులతో చూస్తూవున్నాడు.

కొంతసేపటికి అతడు లేచి నిలబడి నెమ్మదిగా తనగదిలోనికి పోయాడు. తాను వ్రాసివుంచిన కాగితాలేవో బయటికితీసి చదువుకుంటూ సవరణలు చేయడానికి ఆరంభించాడు. అతిజాగ్రత్తగా చదువుతూ, అక్కడక్కడ అతిభద్రంగా సవరణలుచేస్తూ చాలా కాగితాల్ని తిరగవేశాడు. చివరకు ఆకాగితాల్ని అతడు ఒకమాసపత్రికలో పెట్టి ఆప్రతికను మూశాడు.

౧౪

ఆ నాటిరాత్రి చాలాపొద్దుపోయాక సుగాత్రి రుచీదేవిగదిలోకి వెళ్ళింది.

'రుచీ! సంతోషవార్త. భరద్వాజుడు మంచిమనిషి. నీకుకూడా ఇట్టి సంతోషం కలగాలని కోరుతున్నాను.'

రుచీదేవి చాలాసేపటినుంచి ఏడుస్తూవుంది, శాబోలు! ఆమెకళ్లు వాచి ఎర్రగావున్నాయి.

'సుగాత్రీ! నీ సిద్ధాంతాన్ని నీవు నిజంగా నిరూపించావు. కాని ఒక సంగతి. అతణ్ణి పెళ్లాడ్డంలో అంత తొందరఎందుకు పడతావు? అతని సంగతి నీకు పూర్తిగా తెలియనే తెలియదు కదా!'

'అతడు తనకుటుంబచరిత్ర అంతా నాకు చెప్పాడు. వంపు, టొంపు లేని వంశం. వంశంలోని వారంతా సద్వర్తనులు. పైగా అతని పినతండ్రికొడుకు ఒకడు కాలేజీలో నాసహాధ్యాయుడై వుండినాడు. భరద్వాజుడు నన్ను మన్నించినందుకు నాకు చాలా ఆనందంగావుంది. అది ఒకపరీక్ష, రుచీ! అవునా? కాదా? నాసిద్ధాంతం సత్యమే కావడం అది నిరూపించింది. కాని మావివాహం జరగక పూర్వమే నేను అతనితో సత్యవృత్తాంతం చెప్పేస్తాను. ఒక సంగతిమాత్రం నిజమైంది. నిజంగా ప్రేమిస్తే ఒకస్త్రీని ఆమె ఎంత భ్రష్టురాలుఅయినా పురుషుడు మన్నిస్తాడు అనేసంగతి నాకు స్వానుభవపునరుక్తమైంది.'

'నాకు ఆశ్చర్యంగావుంది. నా మగనికి ఈవేళ వైర్‌లెస్‌తంతి ఇచ్చాను.'

'అయితే, లోగడ నీమగనికి విడాకు ఇచ్చివున్నావు కాదూ?'

'ఏస్త్రీఅయినాసరే తాను మొదటిగా ప్రేమించి పెళ్లాడిన పురుషుడికి ఏకారణంచేతగాని హృదయపూర్వకంగా విడాకు ఇస్తుందంటే నమ్మలేము.'

'ఇంతకీ, రుచీ! నీతంతికి అతడు జబాబు ఇస్తాడని అనుకుంటావా?'

'నీవు అనుకుంటావా?' ఉద్విగ్న అయి రుచీదేవి ప్రశ్నించింది. 'ఇక్కడ కూడా నీ సిద్ధాంతమే పరీక్షింపబడుతూవుందనే విషయం నీకు అవగాహన అయివుండును.'

'ఇస్తాడనే అనుకుంటాను—ఇవ్వాలని ఆశిస్తాను.' అంటూ సుగాత్రి తనచేతులు రుచీదేవి మెడలో వేసింది.

౧౭

ఆనాటి ఉదయాన్ని ఓడ కలకత్తా రేవు చేరుతుంది. సూర్యుడు తన ఉదయకాంతుల్ని బరపి లోకంలోని అంధకారాన్ని విరియిస్తూవున్నాడు. ఆసమయంలో ఓడపై భాగంమీద సుగాత్రి తనప్రణయుని పార్శ్వాన్ని నిలిచివుంది. అప్పుడు సూర్యభగవానుడు తనకాంతుల్ని ఆమెమీదబరపి ఆమెను ఒక దేవకన్యకలాచేశాడు. ఆసమయంలో ఆమె అపూర్వసౌందర్యంతో అలరారుతూవుంది. ఆ ఆనందోద్వేగంలో ఆమె రుచీదేవిసంగతే పూర్తిగా మరిచిపోయింది.

అప్పుడు ఆమెకు అల్లంతదూరాన్ని ఒంటరిగా నిలబడివున్న రుచీదేవి కనిపించింది. కలకత్తా రేవు వైపు ఆమె కాంతాదృష్టులు బరపుతూ నిలిచివుంది. ఒకనిమిషం భరద్వాజున్నివదలి సుగాత్రి రుచీదేవి వద్దకు వెళ్ళింది.

'రుచీ! అతనివద్దనుంచి బదులు వైర్ లెస్ తంతి వచ్చిందా?'

'వచ్చింది. నన్ను కలుసుకుని మాట్లాడు తానన్నాడు.'

ఆమెప్రత్యుత్తరంలో ఆ వేదన, ఆకాంక్షకూడ మిళితమైవున్నాయి. 'అది నీసిద్ధాంతవిజయానికి సరి ఒక నిదర్శనంగా చెప్పడానికి వీలులేదనుకుంటాను. ఏమంటే—అతని ప్రత్యుత్తరం ఏమంత ఆశాద్యోతకంగా లేదు. అతను చెప్పిందల్లా వచ్చి నన్ను కలుసుకుంటానని.'

'కలుసుకోవడంమాత్రం—విడాకుయిచ్చిన భార్యను కలుసుకుంటానని చెప్పడంమాత్రం గొప్పవిషయమే.'

రుచీదేవి ఊరికే తలఊపింది.

'పెళ్ళికావడంతోటే మేము ఇద్దరమూ కాశ్మీరయాత్ర చేయ తలచివున్నాము- మేము తిరిగి కలకత్తా రావడంతోటే డక్కావచ్చి నిన్ను చూస్తాను''

'తప్పకరా, సుగాత్రీ!'

ఓడ రేవుచేరింది. రుచీదేవి తంతిమీద డక్కానుంచి ఆమె పూర్వపుభర్త హరిశ్చంద్రుడువచ్చి ఆమెను డక్కా తీసుకువెళ్లాడు.

కలకత్తాలో దిగడంతోటే సుగాత్రి, భరద్వాజులు పెళ్ళికార్యం పూర్తిచేసుకుని విలాసయాత్ర కొరకు కాశ్మీరదేశం వెళ్లారు.

౧౮

రెండురోజుల తరువాత, సుగాత్రి రుచీదేవికి ఒక టెలిగ్రామూ, రుచీదేవి సుగాత్రికి వొకటెలిగ్రామూ ఇచ్చుకున్నారు. దారిలో ఆ టెలిగ్రామూ, ఈటెలిగ్రామూ వాలు ఎదరగా తారసిల్లాయి.

* * *

రుచీదేవి సుగాత్రికి ఇచ్చిన టెలిగ్రాము: 'నీసిద్ధాంతం అక్షరాలా నిజం. మరి వొకసారి నీసిద్ధాంతం అనుభవంలో సత్యమైంది. హరిశ్చంద్రుడూ, నేనూ తిరిగి పెళ్ళి చేసుకున్నాం.'

* * *

సుగాత్రి రుచీదేవికి ఇచ్చిన టెలిగ్రాము: 'సిద్ధాంతం ఎంతవరకు నిజమైందో చెప్పలేము. బహుశా నాసిద్ధాంతం తప్పుసిద్ధాంత మనుకుంటాను. నేను ఆమాసపత్రికలో కంకతాపట్టి భరద్వాజుడికిఅప్పగించినకథ భరద్వాజుడు వ్రాసింది. అతడు మారుపేరుతో దానిని వ్రాయడంవల్ల ఈప్రమాదంజరిగింది. అతనికథనే అతనికిఅప్పగించి నేను నాటకం ఆడానన్నమాట.'

ఆంధ్ర మహాశయుడా! నీవు నవాదర్శసందేశమునకు వాహకుడవా!

# కావలసిన దేది ?

"ఇప్పటికైనను నీకు కావలసినది తెలిసినదా? అందులోనే ఆత్మస్వాతంత్ర్యమున్నది. ఆత్మ బలిదానమే తత్సాధనమునకు మార్గము. లెమ్ము, నీకు కావలసిన దేది ?"

రచయిత :

## శ్రీ గిడ్రాజు రామా రావు

ఆంధ్రుడా! ఏమున్నది దీనిలో దీని వెంట బడుచున్నావు?'

'సౌందర్యము.'

'సౌందర్యమున కిది కేంద్రస్థానమా ? నీకు మరియొకటి దొరుకలేదా? ఏమున్న దిందులో చెప్పుము?'

'విద్య.'

'పిచ్చివాడా! అది ఒకనికి అందునది కాదు. అందేవరకు నీవు సేవకుడిగా నుండవలసినదే. విద్యకు స్వతంత్రము లేదు. ఇక నీవు కోరునది దేనా ?'

'ఏమో! నాలో నున్న దేదో దానిలో నున్నది. అందులకై దాని వెంట బడుచున్నాను.'

'నీలోనున్న దేది ?'

'జ్ఞాపకము లేదు. ఏదో చైతన్యశక్తి అనుకుంటాను. హృదయమాకర్షింపబడుచున్నది. ప్రయత్నించుచున్నాను. అది ఏదో చెప్పజాలకున్నాను.'

'ఎప్పటి నుంచి ?'

'చిన్నతనమునుంచి.'

'ఇంతకు నదేదియో తెలియకుండగనే పిచ్చివాడివైతివా ?'

'నాకు తెలియదు.'

'ఒకవేళ యౌవనమేమో ?'

'కావచ్చునుకాని ఆ చిహ్నలు నాలో ప్రాముఖ్యముగా లేవే !'

'దేశసేవయా ?

'అంత చిన్న ప్రశ్నకు సమాధానమేమి చెప్పగలను ?'

'నీవు నవాదర్శసందేశవాహకుడవా ?'

'ఆదర్శమనేది దేనికి సంబంధించినదో తెలియదే.'

'నవయుగారంభమునకు ప్రతినిధివా నీవు ?'

'యుగము మార్చడము మనుష్యునితరమా?'

'నీవు విప్లవవీరుడవా ?'

'విప్లవమంటే నాకు భయము.

'అయితే నీహృదయములో శాంత మలవడినదా ?'

'అది లోపల శిలఅయిపోయినట్లుంది.'

'నీకు ప్రేమ లేదూ ?'

'దేనిమీద ?'

'దేనిమీదనైనా సరే—'

'మాయమ్మమీద ఉన్నది.'

'అది ఎట్లాఉంటుందో చెప్ప గలవా ?'

'కటికచీకటిపోయి తెల్లవారచున్నట్లనుపించును. అప్పుడు నాకి ప్రపంచముతోనే దగ్గర బంధుత్వమున్నట్లనిపిస్తుంది. అదేదో రహస్యమైన మమత— హృదయాన్ని హృదయాన్ని కట్టివేయుచున్న త్రాడువలె ఉంటుంది. శరీరాలను ఆత్మలను కలిపి బిగించుచున్నట్లనుపించును. ఇంకా ఏమో నేను చెప్ప లేను.'

'ఇదంతా మీయమ్మమీదేనా?

'క్షమించాలి. అమ్మదగ్గర బయలుదేరి ప్రపంచమంతా చుట్టుకపోతుంది.'

'ఇంతకూ నీకేది కావలెనో చెప్ప లేవా?'

'చెప్పితినిగదా? ప్రేమయని.'

'సరే! చక్కనిభార్యని కట్ట

...ని ప్రపంచకాంతారమున రెండు స్వతంత్రపక్షులుమాదిరి విహరింపవా?'

'తక్కిన జనముతో సంబంధము లేకుండానా?'

'అవును.'

'రామరామ! నేను కోరునది అది కాదు.'

'ఐశ్వర్యమును కోరుదువా?'

'పిచ్చికుక్కవలె దానివెంట బడుదునా?'

'ఆరోగ్యమును కోరుదువా?'

'దానినెప్పుడు కోరుచుందును. అది క్రొత్తదికాదే!'

'ఇక నీలో క్రొత్తగా వచ్చినది యౌవనోద్రేకముతప్ప వేరేమియు లేదు.'

'యౌవనములోనే మున్నది?'

'ప్రేమయున్నది.'

'అది ఇచ్చిపుచ్చుకొనే పదార్థమా?'

'ఎంతఇస్తే అంతవస్తుంది.'

'నే నీయకుండా వస్తుందా?'

'చెప్పలేను.'

'నే నిస్తే వస్తుందని నమ్మకమేమి?'

'చెప్పలేను.'

'అయితే నాకు కావలసినది అదికాదు.'

'నీకు కావలసినదేదియో చెప్పలేవు. పోనీ! అది నీకెందుకు కావలెను?'

'ఆత్మానందమునకు.

'అది పుస్తకములలో చదివిన ముక్కా లేక ఆత్మానందమంటే నీకు తెలియునా?'

'కలలో అనుభవించినట్లుగా ఉంటుంది.'

'ఎట్లా ఉంటుందో చెప్పగలవా?'

'మనుష్యులందరూ స్వతంత్రముగా బ్రతుకుచున్నట్లు వారిలో నేనొక స్వతంత్రుడుగా నున్నట్లు ఉంటుంది.'

'అట్లాంటివాళ్ళు ఎక్కడైనా ఉన్నారా?'

'యుద్ధపైశాచికతాండవము లేకుండా ఉంటే విదేశాలు అట్లా ఉంటాయని అనుకుంటాను.'

'కాబట్టి నీవుకోరేది స్వతంత్రాన్ని గదా?'

'అవును.'

'ఆత్మస్వాతంత్ర్యాన్నా, ప్రజాస్వాతంత్ర్యాన్నా, రాష్ట్రస్వాతంత్ర్యాన్నా, దేశస్వాతంత్ర్యాన్నా, సాంఘికస్వాతంత్ర్యాన్నా – దేనిని నీవు కోరేది?'

'ఆత్మానంద మెందులో ఉంటే దాన్ని.'

'అన్నిటిలోనూ ఉంది.'

'అయితే ఆత్మానందము అన్నిటికి వేరువేరుగా ఉంటుందా లేక అన్నిటికి కలిపి ఒక్కటేనా?'

'సాంఘికము, రాజకీయము అని రెండు తెగలే ఉన్నాయి.'

'ఎవరియానందము వారిదే.'

'నేను రెంటికిని చెందనవాడిని. నాయానంద మేది?'

'నీవు అచ్ఛమైన గాంధీమతస్థుడవన్నమాట!'

'కావచ్చును. కాని కోరేది అంత పెద్దదిగా లేదే.'

'ఓహో! ఇందులో సంకుచితమున్నదా?'

'ఔను. అందులోనే విశాలము.'

'నీ హృదయములో సరిహద్దులు పెట్టుకున్నావా?'

'లేదు. హృదయమంతా ఒక్కటే భాగము.'

'పిచ్చివాడా! ఇంకను నీకు కావలసినదేదియో తెలిసికొనలేక పోతివా? ఎన్నాళ్ళీ నిద్ర. లెమ్ము లెమ్ము. హృదయములను చీల్చుకొని చూచుకొనుము. నీకు కావలసినది పటము గీయబడియున్నది. నీకోరిక రక్తములో కలసిపోయినది.'

* * *

నీవు త్యాగశీలుడవే. కావుననే ఇరువదిరెండు కోట్ల రూపాయలు విసరివైచుచున్నావు.

నీవు ధర్మాత్ముడవే. కావుననే కులపక్షభేదాలను విడచుచున్నావు.

నీవు శాంతవీరుడవే, కావుననే గంభీరముగా నున్నావు.

నీవు అమాయకుడవే, కావుననే నీకేది కావలెనో తెలిసికొనజాలకున్నావు.

ఇప్పటికైనను నీకు కావలసినది తెలిసినదా? అందులోనే ఆత్మస్వాతంత్ర్యమున్నది. ఆత్మబలిదానమే తత్సాధనమునకు మార్గము. లెమ్ము. నీకు కావలసినదేది?

# ప్రమాదినామవత్సరం ఆంధ్రులపాలిటి ఆశాభంగనామసంవత్సరం

# ఆంధ్రులు : ఆశాభంగము

మద్రాసు మంత్రులు తమ శాసనసభలో అధిక సంఖ్యాకముగా తీర్మానించిన తీర్మానమును ఇండియా మంత్రి గౌరవించనప్పుడు ఇండియా మంత్రికి వెంటనే ప్రజాభిప్రాయానికి, తమ తీర్మానానికి వ్యతిరేకముగా తాము నడువజాలమని మద్రాసు మంత్రివర్గం స్పష్టపరచవద్దా ?

రచయిత :

## మల్యాల వేంకటశివరామకృష్ణ

ఆంధ్రరాష్ట్రసమస్య శాసనసభలో అధికసంఖ్యాకంగా తీర్మానమయింది, ఇక రాష్ట్రం రావడమే తరవాయి అన్నారు కొందరాంధ్రులు. నిజంగా వచ్చేస్తోందేమో రాష్ట్రం అని చిటుకూచిటుకూ మంటూ తొంగిచూసేరు కొందరాంధ్రేతరులు. వచ్చేసిందనడానికేమీ అభ్యంతరంలేదు, కాని మీరు నిద్రపోకండా కొంచెం జాగ్రదవస్థలో వుండండని హెచ్చరించేరు కొందరు పెద్దలు. మీరింకా ఈ విధంగానే నిద్రపోండోయ్ అని కలవరించేడు కల్నలు మూరుహెడ్ ఆంధ్రదేశంమధ్యనుంచి వెడుతూ రైల్లో నిద్రపోతూను. ఇలావుంది ఈ సమస్య.

ఆంధ్రరాష్ట్రాదాయం ఆంధ్రజిల్లాలలోనే ఖర్చుచేసేటట్లు బడ్జెటులో నేర్పరచాలని ఆందోళన జరిగింది ఆమధ్య. మొన్నటి బడ్జెట్లో రాజాజీ తప్పకుండా దీనివిషయమై ఏర్పాటుగాని లేకపోతే ఏదేనే ప్రకటనేనా సరే (కళ్ళనీళ్ళు తుడవడానికి?) చేస్తారనుకున్నారు రాజాజీని నమ్మిన ఆంధ్రమిత్రులు కొందరు. కాని ఈ తెలుగుగోల తనకేమీ అర్థం కానట్లో, లేక వినపడనట్లో సంచరించా డాతమిళమహాశయుడు!

పోనీ దాని సంగతెలావున్నా మన తెనుగుమంత్రి ప్రకాశంగారు తొందరగడ్డవగైరా చిన్నచిన్న ప్రాజెక్టులు మీకు మళ్ళీయేడు ఏర్పాటు చేయిస్తానన్నారు. అవేనా ఈయేడు వస్తాయేమోనని ఆశించేరు మరికొందరు. కాని ఆ మంత్రిగారు గట్టిగా ఇంగ్లీషులో (హిందీలోనో?) చెప్పినా తెలియలేదు మన అమాత్యప్రముఖునకీ తెలుగువారి గోల. ఆవిషయంలో కూడా ఆంధ్రుల కాశాభంగమే అనడానికి సందేహంలేదుగదా!

తుంగభద్రా ప్రోజక్టువిషయం కూడా మళ్ళీ యేటికి చూసుకుందామని వాయిదావేసి నట్లేగదా—ఇంకా తెగతెంపుల్లేని ఆసీటిపంపకాల వివాదం (పరిష్కారమైపోయిందని మాటిమాటికీ పత్రికలలో ప్రకటింపబడినప్పటికీ) పరిష్కారం కాకపోవడంచేత!

మొన్న నీమధ్య జరిగిన ఎలక్ట్రికల్ ఇంజినీర్లను వేసికొనుటలోనేమి, తదితర ఉద్యోగాదులు వే[illegible]లో నేమి ఆంధ్రుల కాశాభంగమే గదా!

ఆంధ్రరాష్ట్రమునకు వలసి[illegible] రేడియోబ్రాడ్ కాస్టింగు స్టేషను నిర్మించుటలోకూడ గతసంవత్సరమును, ఈసంవత్సరమును మదరాసు ప్రభుత్వం ఆందోళనచేయలేదు. అం[illegible]వల తిరుచునాపల్లి స్టేషన్ మాత్రం పూర్తిచేయించుకున్నది.

సరి మనడాక్టరు పట్టాభిగారు జాతీయమహాసభాధ్యక్షుడవతాడని ఆంధ్రులు, ఆంధ్రేతరులుకూడా అధికసంఖ్యాకులు అనుకొన్నప్పటికీ ఆవిషయంలోకూడా ఆంధ్రుల ఆశలడుగంటిన సంగతి లోకవిదితమే గదా!

రాజాజీకూడా ఆంధ్రరాష్ట్ర విషయమై ఇండియామంత్రికి గట్టిగా రాసేనని సెలవిచ్చేరు: ఆంధ్రదేశయాత్రలో అనేక ఉపన్యాస వేదికలమీద, అసెంబ్లీలో ప్రశ్నోత్తరకాలంలో. గవర్నరగు ఎర్

్క న్ ప్రభువు కూడ ఘాటుగా రిక మండ్ చేసేడని తెలిసింది. ఏమ ుతే నేం చివరకి తీరావచ్చి ఇండి యామంత్రి ఇప్పుడు సమయం కాద ష్టట్లుగా చెప్పినట్లు అమాత్యులు లవిచ్చేరు నిన్న కాక మొన్న.

ఇంతకీ ఈవిషయంలో ఆంధ్రుల ాశాభంగము, అన్యాయము కలు లేదని చెప్పుకొని మురియడాని ై నా ఒక్కవిషయమూ కనిపించ ంలేదు. ఈ పై విషయా లన్నిటినీ ట్టి చూ స్తే ఈ 1939 సంవత్సరం ంధ్రమాతజాతకంలో చాలా దుర ృష్టమైన ఆశాభంగనామవత్సరం ా కనిపిస్తోంది. కాని ఆవిషయమై ర్చించడం జ్యోతిష్కులకు వదలి ెడదాము.

ఇండియామంత్రి ఉద్దేశాన్ని స్థాని సెలవీయడంతోనే ఆంధ్రు లో సంచలనం కలిగింది. కేంద్ర ాసనసభలోని ఆంధ్రసభ్యులు తమ అంగీకారాన్ని వెలిబుచ్చేరు. ఇం యామంత్రి చర్యలకు ఆంధ్రరా ్ట్ర కాంగ్రెసు సంఘాధ్యక్షులగు డా రు పట్టాభిసీతారామయ్యగారు, విషయమై పెద్దప్రకటనను జారీ సేరు పత్రికలలో. దానిలో ఆంధ్ర ాష్ట్ర మేర్పడవలసిన యత్యంతా సరాన్ని స్పష్టీకరించేరు. నిజము వారు వ్రాసినట్లు ఆంధ్రరా ్ట్రంవిషయమై కలుగుచున్న వత్తి కి పట్టాభిగారు గనుక తాళగలిగి ద్రాసు శాసనసభలో ఐక్యము డకుండా నెగ్గుకు వచ్చేరుగాని మరి ుకరైనచో ఈసరికి మధ్యపర ాలలోని మంత్రివర్గమువలె ఈ యాంధ్రమంత్రులు కూడ రాజీనామాలను దాఖలుచేయవలసియుండే ప్రతిష్టంభన మేర్పడెడిదేమో?

మొన్నటి స్టేటుమెంటులో డాక్టరు పట్టాభిగారింకొక చిన్న టుమ్రీకూడ విసిరేరు. ఏమన్నారనగా మనకు మద్రాసు మంత్రుల యెడ కావలసినంత విశ్వాసంవుంది. వారు మనతరఫున ఇండియామంత్రికి తగిన సమాధానం చెప్పగలరనే ధైర్యంవుంది; ఇండియామంత్రి అనుకూలంగా పరిష్కరించి తీరునని ధైర్యంవుంది అన్నారు. పైగా, మనం ముందు చేయవలసినదానిని గురించి మంత్రులు తమ అశక్తతను వెల్లడించిననాడే చెప్తాను అన్నారు.

దీని భావమేమి తిరుమలేశ?

మద్రాసుమంత్రులు తమశాసనసభలో అధికసంఖ్యాకముగా తీర్మానించిన తీర్మానమును ఇండియామంత్రి గౌరవించనప్పుడు ఇండియామంత్రికి వెంటనే ప్రజాభిప్రాయానికిని, తమ తీర్మానమునకు వ్యతిరేకముగా తాము నడువజాలమని మద్రాసు మంత్రివర్గం స్పష్టపరచవద్దా! అట్లు కానిచో నూతనరాజ్యాంగచట్టం ప్రకారముగా తమరు తీసికోదలచిన —తీసికోగలిగినంత స్వేచ్ఛను తీసికొనుటకు ఇండియామంత్రి అడ్డు చెప్పుట వీరి కవమానకరముగాదా? వీరిమాట త్రోసిరాజన్నట్లే కదా?

ఇండియామంత్రికి తగినవిధంగా వీరు సమాధానం చెప్పగలరను ధైర్యం వుందనిచెప్పు పట్టాభిగారి మాటలు — ఇండియామంత్రి తన యభిప్రాయమునే కొనసాగింప గట్టిగా పట్టుబట్టినచో మద్రాసు మంత్రులు రాజీనామాల నీయవలెనని సూచించుటలేదా? అట్టి ప్రతిష్ఠంభనచేసే సమయమే వచ్చినచో ఇండియామంత్రి తన యభిప్రాయమును మార్చుకొని ఆంధ్రరాష్ట్రమున కనుకూలముగా పరిష్కరింపక తీరదని పట్టాభిగారే చెప్పుచున్నారే! లేనిచో నిది అఖిలభారత సమస్యగా దిగి అన్ని కాంగ్రెసురాష్ట్రములమంత్రులును ఈమాటపై రాజీనామా నీయవలసియుండునే!

ఒకవేళ అట్టి ప్రతిష్ఠంభనకైనను ఇండియామంత్రి జంకక నడుమంత్రపు మంత్రాగము నేర్పరపించి నాటక మాడింపదలచినయెడల అప్పుడు కాంగ్రెసుమంత్రివర్గము పూర్తిగా తమ యశక్తతను వెల్లడించినట్లే యగును కావున అటుపైని మనము నడచుకొనవలసిన కార్యక్రమమును తాను సూచించెదనని పట్టాభి యభయమిచ్చుచున్నాడే!

డాక్టరు పట్టాభిగారి ఈప్రకటన యొక్క అంతరార్థము మద్రాసు మంత్రులును ఇండియామంత్రియు జాగ్రతగా నర్థముచేసికొని శీఘ్రచరణమునకు గడంగుదురుగాక! ఆంధ్రరాష్ట్రసమస్యకును, ఆంధ్రులకును అగ్నిపరీక్షాసమయమే తెంచినది! ఇండియామంత్రికి సలహాదారుగా నియమింపబడిన యాంధ్రుడగు శ్రీ ఈడ్పుగంటి రాఘవేంద్రరావుగారీవిషయమున తగు సలహా నిచ్చెదరని నమ్ముచున్నాను.

## మదరాసుభూమి ఎవరిదో చారిత్రకపురుషుడు చేయెత్తి చెప్పడూ

# ఆంధ్రమాతకు ఓదార్పు

మదరాసు ఆంధ్రమహాసభలో శ్రీ ఈడ్పుగంటి రాఘవేంద్రరావుగారి ఉపదేశం అయిన పిమ్మట ఆ సభకు వచ్చిన ఆంధ్రమాతకూ, ఆమె అనంగు బిడ్డలయిన ఆంధ్రవిష్ణువు - శాతకర్ణి - రాజరాజ నరేంద్రుడు - ప్రతాపరుద్రుడు- రుద్రమదేవి- శివస్కంధవర్మ- బాలచంద్రుడు- కృష్ణరాయలకూ ఈ సంభాషణ నడిచింది.

రచయిత :

ఆంధ్రపుత్రుడు

రాఘవేంద్రుని సందేశంలో తన పసుపు కుంకుమల భాగ్యం తేలుతుందని అతి ఆతురతతో ఆంధ్రమాత చెన్నపురి ఆంధ్ర మహాసభాభవనాన్ని— విక్టోరియా పబ్లిక్ హాలును- అలముకొన్నది. పెన్నిధికన్న పేదచందమున ఆపుత్రులనుచూచి సంతసించింది. కాని బ్రతికియున్నవారిలో పెద్దకొడుకైన కేసరి, అతని అనుచరులు రాజాజీవలలో తగుల్కొని రానందుకు డెందమున ఆందోళనపొందింది. ఈచక్రవర్తిపెట్టే చిక్కులలోపడి తలక్రిందులు అవుతున్న తనముద్దుబిడ్డలనుచూచి ఆమెకడుపు తరుక్కుపోతోంది. జీవచ్ఛవాలవలెనుండు తన పుత్రులు ఎప్పటికైనా తిరిగి జీవంకలవారు అవుతారా అనేదే ఆమెభయం. ఆంధ్రుల ఒర్మియే ఆజాతికి శని అయినది. చక్రవర్తి వెలుగుతున్నాడు.

రాఘవుడు చెప్పిన రహస్యంవిని ఆంధ్రమాత సొమ్మసిల్లి నేలకొరిగినది—ఆంధ్రులు తమరాష్ట్రమును సంపాదించుకోడానికి యితరులను ప్రాధేయపడుట అధర్మమని- కాంగ్రెసు ఆంధ్రరాష్ట్రం సంపాదించడానికి తగినసాయంచేయ లేదంటే మూలసూత్రాలలో ఏదో మోసంవుండివుండాలని అతడు అన్నాడు.

ఆమాటలువిని ఎవరూ ఆంధ్రులకు వుపకారంచేయరు, నాపుత్రులు శక్తిలేక నిర్జీవులై యున్నారు కదా యని దుఃఖసాగరంలో మునిగిపోయింది ఆంధ్రమాత. ముక్కోటిప్రజలను కన్న ఆంధ్రజననికా యీదురవస్థ ?

రాత్రి తొమ్మిదిగంటలైంది. జనం అంతా ఆభవనం వదలివె యారు, ఆమెవైపు చూసినవా లేరు. ఆమెనుగూర్చి జయధ్వా ములైనా చేసినవారులేరు. ఆవె నిదురలో వెక్కి వెక్కి ఏడ్చుచున్న ది. అప్పుడు అలనాడు ఆంధ్రరాజ్య లక్ష్మిని నెలకొల్పిన ఆంధ్రవిష్ణువు శాలివాహన, శివస్కంధ, రాజర జనరేంద్ర, ప్రతాపరుద్ర, రుద్రమ దేవి, బాలచంద్రుడు మొదలై వారందరూ అక్కడకు వచ్చారు—

ఆంధ్రవిష్ణువు

అమ్మా! ఏల నీకీ దురవస్థ.

ఆంధ్రమాత

తండ్రీ! ఏమని చెప్పుకొనను. యినవారందరూ అంతరించారు నిన్నగాక మొన్నటివరకువున్న ముసలి విశ్వదాత కూడా దివంగతె డైనాడు. నాకై చూచేవారులేరు హిందీమాత పూజలో పడిపోతె న్నారు. నా సుతులు జీవన్మృతులు రాజాజీ భావధాసులు. నాయనా విష్ణు నీవునానుదుట బొట్టు పెట్టితివి సకలరాజన్యులు పూజించునట్ల చేసితివి. కాని. . .

ఆంధ్రవిష్ణువు

జననీ! దుఃఖింపకుము. నీకం తడి నాజాతికి జయప్రదముకాదు తల్లికన్న వేరే దైవములేదను నా నుడి సోదరులు మరచిపోయిరా

ఆంధ్రమాత

నాయనా! దుఃఖముకాక సం సము ఎట్లు కలుగును? వీరాగ్రే

...లను కన్న యీ గర్భము పొట్లి ...యినది.

ఆంధ్రవిష్ణువు

అది ఎట్లు తల్లీ! జగజెట్టియగు ...ట్టాభిలేడా?

ఆంధ్రమాత

పేరుమాత్రం పట్టాభిగాని పట్టం ...ట్టడానికి తగడనేకదా తండ్రీ! ...రవలు——

ఆంధ్రవిష్ణువు

అరవలా! ఆంధ్ర సామ్రాజ్య ...క్ష్మివైన నీకు వారు చాలకాలం ...గదాక్రాంతులై యుండినవారు క...గా! నేడు...

ఆంధ్రమాత

నేడు వారు మీ మాతచే ...గాడిగము చేయించుకొనుచున్నా..., నా మొఖాన పేడనీళ్ళు చల్లు...న్నారు. ఈ అవమానం చూచి ...గాడా నిస్తేజులైనారు నీసోదరులు.



'రాధాకృష్ణ'లోని రాధ - లక్ష్మీదేవి

ఆంధ్రవిష్ణువు

నీ అవమానము చూచి సహించువారు నీ పుత్రులు ఎట్లు అగుదురు? అట్టి పిరికిపందలు నాసోదరులని చెప్పకుము...

ఆంధ్రమాత

అవమానము భరించుటే కాదు, బిడ్డా! భిక్షాపాత్ర చేతపట్టి దేహీ యని నాపసుపుకుంకుమము ముష్టి ఎత్తుతున్నారు- ఇంటింటికి,సంస్థసంస్థకీ. ఈముష్టి కుంకుమలో కాంతి...

ఆంధ్రవిష్ణువు

అయినకాడికి అడ్డెడు తవ్వెడు యిచ్చి అమ్మా! నీ ప్రసాదమన్నట్టు ఈముష్టితవ్వె మెటుల దాపురించిందో కదా నా సోదరసంతతికి.

శాతకర్ణి

తల్లీ! మేముచేసిన వీరవిహారముల విస్మరించిరా! ఆంధ్రులు అంధులైనారా నేటికి?

రాజరాజనరేంద్రుడు

అమ్మా నేను నీ అనుగ్రహము వల్ల కృతిపొందిన భారతమును నా తమ్ములు చదువుటలేదా? ముష్టి వల్ల ధర్మరాజు రాజ్యంపొందలేదన్నవిషయం వారు గుర్తించుటలేదా? లేక నీసంతతికి శక్తిపోయినదా!

ఆంధ్రమాత

లేదు, నాయనా! లేదు! నీఆంధ్ర భాష ఎవరికి కావాలి? దానికి రాజభాషగావుండే యోగం నీతోనే అంతరించిందేమో! కాదుకాదు శ్రీకృష్ణరాయలతో అంతమందింది. శ్రోత్ర వాక్కవింత అని ఆంధ్రదేశంలో ఇప్పుడు హిందీపైవున్న మోజు ఇక దేనిమీదా లేదు. కాంగ్రెసు భారతం తప్ప యింకేదీ ఈ అంధులకు కనుపించడంలేదు. అది బాగా నెత్తికి ఎక్కింది. ఆ భారతానికి ఆద్యబ్రహ్మ అయిన గాంధియయ్యంకుడే ఇప్పుడు ఆంధ్రులకు గురువు.

ప్రతాపరుద్రుడు

ఆ గురువుది ఏమిమతం?

ఆంధ్రమాత

వారికి జాతిమత విపక్షతలు లేవు. గాంధికి కూతురుని యిచ్చిన ఆచారివారు చక్రాంకితులయిన చక్రవర్తులు. తమ చక్రంతో ఆంధ్రులవల్లు అంతా చక్రాంకితం చేస్తున్నారు. మనవారి అందర్నీ అరవలనుగా చేసేస్తున్నాడు. మదరాసులో ఆంధ్రులందరూ అరవలక్రిందనే జను. రాజాజీ చక్రాంకితం చేత ఆ ప్రముఖులు తుదకు నన్నే మరచిపోయారు. అడ్డాలలో నున్నంతసేపేకదా బిడ్డలు.

ఆంధ్రవిష్ణువు

చక్రవర్తేనా చక్రాంకితంచేసేది.

ఆంధ్రమాత

ఏమి చెప్పను తండ్రీ! అతనికే ఆదుర్బుద్ధి.

ఆంధ్రవిష్ణువు

అమ్మా! రాజాజీ పూర్వులు ఆంధ్రులే. కాని పులికి ఆకలివస్తే తన పిల్లలనే తినేస్తుంది అనే సామెతవలె అయిందిప్పుడు.

ప్రతాపరుద్రుడు

అమ్మా! అయితే మనసాంబుడు కూడా వైష్ణవం అవలంబించాడా?

ఆంధ్రమాత

అతనిని వెలివేసినట్టు కేటాయించారు. ఒంటివాడై పోయినాడు. లేకుంటే యీసరికే నాపని అటో యిటో అయిపోయేది.

ప్రతాపరుద్రుడు

జననీ! సాంబుడు ఒంటివాడైనాడని విచారింపకు. అతడు పరిభవానలంలో లేచాడా యీ కాంగ్రెసు మంత్రిత్వం దక్షప్రజాపతి యజ్ఞంలాగ...పోదూ?

రుద్రమదేవి

తల్లీ! ఆంధ్రవనితాలోకం నీ పరిభవం గుర్తించిందా?

ఆంధ్రమాత

పుత్రీ! ఆంధ్రభూమిలో వీరనారీమణులగాథలు నీతోడనే అంతరించాయి అనిపిస్తోంది. ఆంధ్రస్త్రీలు పూడిగముచేయుటకేకాని వీరులను తయారుచేయలేక పోతున్నారు. బిడ్డలుండియు నన్ను గొడ్రాలనిపిస్తున్నారు.

రుద్రమదేవి

ఎంతమాట! ఆంధ్రస్త్రీలు తమ పురుషులు యింకా బ్రతికియేయున్నారని తలుస్తున్నారు. నాకు మల్లే అనాథలైననాడుకదా వారి వీరత్వము బయటకువచ్చేది. మగవారు విజయం తెస్తారేమోనని నీరాజనము లీయ వేచియున్నారు. మగవారు నిర్జీవులైన నాడు ఆడపులి బయటపడును. కోపగించిన ఆడపులిని పట్టే ధీరత ఎవరికైనా వుందా?

ఆంధ్రమాత

అదికాదు, కుమారి! ఆడపిల్లకే కద తల్లియందు మమకారం. అట్టి ఆడవాండ్ల ప్రతినిధియైన స్త్రీ ఒకతె శాసనసభలో మొన్న ఆంధ్రంతో మాట్లాడుట నీచమని యింగ్లీషులో ప్రసంగించింది. హిందీ నేర్చుకుంటే మంచిదనికూడా వాగింది.

రుద్రమదేవి

తల్లీ! ధాన్యములో పొల్లు, మంచినీటిలో చెత్త వుండదూ!

ఆంధ్రమాత

ఆ చెత్తను వదుల్చుకోవద్దూ నీ సోదరీమణులు—

శివస్కంధవర్మ

అమ్మా! ఎందుకు గతజల సేతుబంధనము? కర్తవ్యమేమో యోచింపుము.

బాలచంద్రుడు

కర్తవ్యమున కేమున్నది, తల్లీ!



'జయప్రద'లోని ఇందిర – లలిత.

గ్రజా! సోదరులారా! మనమంద
మము తిరిగి భువికి వెళ్లాలి. ధర్మసం
స్థాపనార్థం జన్మ ఎత్తాలి. తల్లీ! ఇ
గో కత్తి. దీవించి పంపు. సంవ
త్సరంలోపున నీ నుదుట కోటిసూ
ర్యప్రభావిరాజమానమగు కుంకు
మబొట్టు పెట్టెదను. సకలరాజ
న్యులు, దేవగంధర్వవిద్యాధరులు
న్ను స్తుతించునట్లు చేయనిచో
యీ చేతులను ఆఖడ్గముతో...

ఆంధ్రమాత

బిడ్డా! బాలుడవయ్యు నీ సాహ
సము కొనియాడతగినదే. కాని
వు సంవత్సరము గుడువుపెట్టితివి.
యీలోగానే రాజాజీ నాకాలు
తులు తెగ్గొడతాడేమో! మొం
డమునకా నీవు పెట్టు బొట్టు—రా
వేంద్రుడు చెప్పిన రహస్యము
నిది యొకటి. రాజాజీ పెడరే
ను మంత్రియట. ఆ ఫెడ రేషను
చ్చేవరకు ఆంధ్రులను లొట్టవేస్తూ
ండమంటున్నది కాంగ్రెసు. వ
ర్చాక గులకరాళ్లు గొంతుకలో
డతాడు రాజాజీ! — మదరాసు
రవలపాలు—

కృష్ణరాయలు

మాతా! నీకేమీ భయము
ద్దు. నీకాలి కొనగోరుకూడా రా
జీ ముట్టలేడు. కృష్ణరాయల
త ఖడ్గమున్నంతకాలము విజయ
గరసామ్రాజ్యభూములలో అర
లు ఎట్టి స్థితిలోవున్నారో నీకు
లియదూ! మద్రాసుభూమి ఎవ
డో చారిత్రకపురుషుడు చేయెత్తి
ప్పుడూ? గాంధీవియ్యంకుడు చరి
తనుకూడా కాదంటాడా?

# విజ్ఞాన విషయాలు

గ్రేట్ బ్రిటన్‌లో లైసెన్సుపొందిన రేడియో సెట్లు 90,00,000 (తొంభైలక్షలు) లకు పైగా వున్నాయి.

... ... ...

ఎలకలు ఏడాదికి నాలుగు లేక ఐదు సారులు పిల్లల్ని పెడతాయి.

... ... ...

ఒక్క మధ్యధరాసముద్రంలోనే 400 (నాలుగువందల) రకాల చేపలు పరిశోధింపబడి గుర్తింపబడ్డాయి.

... ... ...

దుంపకూరల్లో బంగాళాదుంపలకు తరవాత 'బీట్‌రూట్' అనే దుంపలలో ఎక్కువ పుష్టికరమైన ఆహారపదార్థాలు వున్నాయి.

... ... ...

అమెరికా యునైటెడ్‌స్టేట్సులో ప్రతి 14 సెకండులకు ఒక శిశువు జనిస్తూవుంది.

... ... ...

సిరియా, ఆర్మీనియా దేశస్థులు ఆకాశ నీలవర్ణాన్ని ఎవరైనా చనిపోయినపుడు విచారాన్ని సూచించే గుర్తుగా వాడతారు. ఏమంటే చనిపోయినవారు ఆకాశంమీదికి వెళ్లారని వారి భావన.

... ... ...

లండన్ మహానగరంలోని సెంట్రల్ లైబ్రెరీలో 2,10,00,000 (రెండుకోట్ల పదిలక్షల) గ్రంథాలు వున్నాయి.

రాగిరంగు జుట్టువున్నవారు మామూలు జుట్టు వాళ్ళకంటు తెలివైనవారు అయివుంటారు.

... ... ...

జావాద్వీపం ప్రపంచంలో అంతే విస్తీర్ణంగల ఏభూభాగంకంటేనూ ఎక్కువ అగ్నిపర్వతాలు కలిగివుంది.

... ... ...

ఈ భూభాగంలో నూటికి 72 పాళ్ళు ప్రదేశం సముద్రంతో నిండివుంది.

... ... ...

జెరూసలెం అంటే శాంతినిలయం అని అర్థం.

'ముఫ్తీ' — మహమ్మదీయుల్లో బడిగల ఒకరకపు వేదాంతులు. గురువు 'గ్రాండ్ ముఫ్తీ.'

... ... ...

సాలీనా హిందూదేశంలో ప్రస మరణాలు రెండు లక్షలు.

... ... ...

ఈయేడు కలకత్తా విశ్వవిద్యాలయ మెట్రిక్యులేషన్ పరీక్ష అభ్యర్థుల సం 44,600.

... ... ...

1937-38 లో హిందూదేశం అ టిలోను కొత్తగా 1236 గ్రామ పోస్టు ఆఫీసులు ఏర్పాటు చేయబడ్డా

... ... ...

1938 లో ఆల్ ఇండియా రేడి వారు కొన్న వైయర్‌లెస్ సా విలువ 9,19,000 రూపాయలు.



'రాధాకృష్ణ'లోని రాధాకృష్ణులు— మాస్టర్ రాజు : లక్ష్మీదేవి.

# ఆంధ్రఘోష

బ్రతుకగనెంచ 'ఆంధ్రు' నని పల్కఁగఁ బోకుము; – పల్కినంత నీ
యతనము బుగ్గిపాలయి, ప్రయాసయె నిల్చును మృత్యుదేవతై;
సతతము దుఃఖభోక్తవయి – శాంతి యెఱుంగక, వీధివీధులన్
వితరణశీలురన్ గనఁగ వేడెదు, కంఠము రుద్ధమొందగా.

అసలే ఆంగ్లజనాధిపుం డొసగు భిక్షాన్నంబు సుంత;–అపస్వర్
విసపుర్ బూతలఁ బూయు నే డరవజుల్ విజ్ఞానసంపన్నులై;
కసితీరన్ బిగఁబట్టి 'బుస్సు' మనుచున్, కాటేయు సర్పంబులై
ల్లైసగన్ 'ఆంధ్రుల' ప్రాణమానముల భక్షింపంగ శంకింపరే?

ప్రకటితరాజ్యవైభవశుభంబుల మున్నెడు దాక్షిణాత్యులే
అకలుషరాగబద్ధులయి – ఆంధ్రుల సోదరు లట్ల గాంచుచో,
వికవిక రేగి– దుఃఖపథవీపరితప్తవిశీర్ణగాత్రులై
సకలమహీతలమ్మున ప్రశాంతి నెఱుంగక 'ఆంధ్రు లుందు రే!'

మనమాతృభాషయే మనరాష్ట్రమందున
　　అరవదేశికులు నేర్పంగవలసె;
కడుపు కాలినయంత పిడికెఁడన్నము నేడు
　　అరవహోటళ్ళె పెట్టంగవలసె;
కట్టువస్త్రమునుంచి పట్టువస్త్రము వఱ
　　కరవలె మనల కమ్మంగవలసె;
మనభాష మనభుక్తి మనబట్ట సర్వమ్ము
　　అరవమయంబాయె ఆంధ్రభూమి;

కటకటా! దాస్యదేవత కౌగిలందు
నిదురబరువుల మోసె నే హృదయభరము;
ఆంధ్రరాష్ట్రసామ్రాజ్యసౌఖ్యమ్ము నందు
కనులుమూయు టెప్పుడో – మాను తెనుఁగుతల్లి.

దిగ్దిగంతాల వెలుఁగు ప్రదీప్తితార
లాంధ్రదేశమ్ము విడినంత నక్కటకట!
ఆంధ్రశౌర్యప్రతాపాగ్ను లారెనేమి?
అరవదాస్యమ్ము నేడు సేయంగవలసె.

జంపన చంద్రశేఖరరావు, బి.ఏ. (ఆనర్సు)

# మణిమాల

జర్నలిస్టుల పలుకుబడి, ప్రాభవం.

ప్రపంచం అంతటా జర్నలిస్టులుపలుకుబడి సంపాదించి అధికారానికి వచ్చారు.

లెనిన్, ట్రాట్స్కీ వారి రివల్యూషనరీ పత్రికల్ని రష్యాలోనూ, విదేశాల్లోనూ కూడా ప్రచురిస్తూ వచ్చారు.

నేటి రష్యన్ నియంత పెట్రోగ్రాడ్ లో 'ప్రావదా' పత్రికకు సంపాదకుడుగా వుండినాడు.

నేటి ఇటలీనియంత ఆదిలో ఇటలీలో సోషలిస్టుతత్వంగల పత్రికను జయప్రదంగా నిర్వహించాడు. తరువాత ఫ్రెంచిప్రభుత్వం అతనికి డబ్బుయిచ్చి ఇటలీ ఫ్రాన్సుతరఫున యుద్ధంలో చేరేటట్లు అతని పత్రికద్వారా ప్రచారం చేయించింది. ఆసమయంలోనే ముసోలినీ ఫాసిస్టుతత్వం అలవరుచుకొన్నాడు.

నిన్నటివరకు టర్కీ నియంతగా వుండిన కెమాల్ ఆటాటర్కు ఆదిలో ప్రభుత్వాన్ని ఎదిరించే పత్రికకు సంపాదకుడుగా వుండినాడు.

నేటి జర్మన్‌నియంత హిట్లర్‌కి ఆదినుంచీ సొంతపత్రిక వుంది.

ఫ్రాన్సు దేశంలో ప్రధానమంత్రిత్వ నిర్వహించివుండిన ప్రతిరాజకీయవేత్తకు ఒక సొంతపత్రిక వుంది. ఆదేశంలో వారు తమ రాజకీయాధికారాన్ని ఆ పత్రికల సాయంతోనే పొందుతారు.

అమెరికాలో పత్రికలు సంపాదన దృష్టితో నడపబడతాయి. యూరప్‌లో పత్రికా సంపాదకులు, ప్రచురణకర్తలు రాజకీయరంగంలో ప్రముఖపాత్ర ధరిస్తారు.

--"*Lords of the press*"

... ... ...

## మన దేవుళ్లు

నేను మా శ్రీనివాసం సింహాచలము చందనయాత్రకు వెళ్ళాం. మరుచటిదినము ఉత్సవమగుటచే గాబోలు తొలినాటి రాత్రికే జనసమూహము క్రిక్కిరిసియుండుటచేత మాకు కూర్చునుటకైన సరియైన స్థలము లేకపోయింది. ఇంతలో మా శ్రీనివాసం స్నేహితుడు ఒకడువచ్చి ఓరేయి శ్రీనివాసం మా బసలోనికి రారా అక్కడ మన స్నేహితులందరూ ఉన్నారు చాలా సౌఖ్యముగా ఉంటుంది కూడానూ, అని మమ్ములను ఆ దేవాలయ ఆవరణములోయున్న తడకలతో కట్టబడిన ఒక గదిలోనికి తీసుకొనిపోయేడు. మేము వెళ్లడమే తడువుగా చతుర్ముఖపురాణము మొదలు పెట్టినారు. నాకు మాత్ర ఆటఅంటే రాదులెండి, అందుకనే నను విడిచిపెట్టినారు. ఇదే సమయమని నే పడకవేశా, కాని నిద్రమాత్రము ప డములేదు, మా ప్రక్క బసలో మాత్రవ ఏవేవో లోకాభిరామాయణము క రులు, గుసగుసలు వినబడుతూయున్న మాటల ధోరణిబట్టి వారు ఈయాత్రకై నిర్మింపబడ్డ స్కౌటు స్టూడెంట్సు తోస్తుంది. వారు ఏదో దేముళ్ళ వి యమై చర్చలు చేస్తూన్నట్టుగా వినబడుతూంది. కొంతసేపయిన తరువాత వాళ్ళలో ఒకడు లేచి వురేయి, వానూ దేవుడు ఒక్కడే అనియు ఇంతమంది దేవుళ్లులేరనియు మాతాతగారు చెబుతుంటే వారుకదా ఈ సింహాద్రి అప్పన్న ఏమిటి, ఆ వెంకటేశ్వరస్వామి ఏమిటి ఆ పానకాలస్వామి ఏమిటి, ఇవేమిటి ఆవేమిటి, అన్నీ దేవుళ్లే, అన్నీ దేవాలయాలే, ఇవెందుకు నిర్మింపబడ్డాయి, దేవుళ్ళెందుకు ఇంతమంది తయారయ్యా



పురూరవుని చేతి చలవ వలనే పంటలు బాగా పండినై అంటున్నారు— 'జయప్రద' లోని రైతులు.

అని అన్నాడు. ఓరేయి సూర్యం! ఇది అంతా వట్టిఅబద్ధము సుమీ ఈ ప్రపంచంలో ఇంతమంది దేవుళ్ళను నిర్మించి ప్రజలను మోసపుచ్చి డబ్బు దోచుకొనుటకే. ఇక ఈ పురాణములు మొదలగునవి ఉన్నాయే అవి కేవలము కల్పితములు అందుచేతనే మన హిందూదేశములో ఇంతమంది దేముళ్ళు ఇన్ని మతములు, ఇన్ని జాతులు, కల్పింపబడుటచే దేశములో ఐకమత్యము లేక కొన్నివందల ఏండ్లనుండి పరరాజపీడనములోనుండుటకు కారణహేతువై యున్నది. అని అన్నాడు మరియొక కుర్రవాడు. అవును నిజమే మరియొక విశేషమేమి టంటే పూర్వకాలములో దేవాలయములన్నియు శివాలయములై యుంటూ ఉండేవి. అప్పట్లో రామానుజాచార్యులు దేశసంచరార్థము బయలుదేరినపుడు ఆయా ప్రదేశములలోనుండే చక్రవర్తులను, ప్రజలను వైష్ణవులుగా మార్చి ఆ శివాలయములను కూడా విష్ణాలయములుగా మార్చెను. ఇందుకు నిదర్శన మేమిటంటే తిరుపతి కొండమీద ఉండే దేవాలయములోనున్న శివలింగమునుతీసి విష్ణువిగ్రహమును ప్రతిష్ఠించేరు. దానికి మహావిష్ణువని పేరు పెట్టినారు. ఆ పేరు ప్రజలకు వాడుకలేక 'వెనుకటి ఈశ్వరుడు' అని పిలుచుచుండెడివారు. ఆనామమే 'వెంకటేశ్వరుడు'గా మారెను అని అన్నాడింకొక కుర్రవాడు. అంతవరకెంకులకు వాసూ! ఈ దేవాలయములోనున్న వరహానరసింహస్వామివిగ్రహము కూడా ఆబాపతికి చెందినవాడే. ఇది మొదట్లో కేవలం శివలింగప్రతిష్ఠయే అది ఒక కఠిన శిల అయి ఉండుటచేత ఒకేనాటిరాత్రి దానిని ఛేదించుటకు వీలులేకపోయింది. ఏలాగునైనా దానిని ఒక విగ్రహరూపముగా తయారుచేయుటకు ప్రయత్నము చేయగా, తుదకిది ఒక వికృతరూపముతో సూకరము ముట్టికలిగి తయారయింది. తానొకటి తలుస్తే దైవమొకటి తలచిందన్నట్లు పాపము చేయునదిలేక దానికి వరహావతారమని పేరు పెట్టినారు. ఇంకొక విశేషమేమిటంటే అది మొదట్లో శివలింగముగా ప్రతిష్టగుటచేత వాడుకప్రకారము ప్రజలు దేమునికి పశువులను, త్రిశూలములను మొదలగునవి అర్పించుచుండెడివారు. ఆ ఆచారము నేటివరకుకూడా జరుగుచున్నవి. మరియు ఆ రూపము సరిగా వరహారూపము లేకపోవుటచేత ప్రజలకు విశ్వాసము ఎక్కడపోవునో అను భయముచేత సంవత్సర పర్యంతరం ఆ విగ్రహమునకు చందనము పూస్తూ యుండవలసినదని రామానుజాచార్యులు శాసించినాడు. ఇక ఈ దేవాలయమును మొట్టమొదట కొలకొశికుడనే విశ్వకర్మ నిర్మించెననియు, దరిమిలాను శింహాద్రి అప్పన్న అనే విశ్వకర్మ దానిని పెంపొందింపజేసి కోవెలను పూర్తిజేసినాడనియు చెబుతూ యుంటారు కొంతమంది అని అన్నాడు.

—మాతృసేవ.

... ... ...

## హిట్లర్ వంటలవాడు

అతనిపేరు కానెన్‌బర్గు. అతనిది బట్టతల. పొట్టిగా, లావుగా బుడంకాయలా వుంటాడు. ఏమంత అందమయిన మనిషి కాడు. కాని నేడు ప్రపంచాన్ని అంతటినీ దద్దరిల్లచేస్తూవున్న హిట్లర్ ఏవూరు పోయినా అతన్నికూడా తీసుకుపోతూ వుంటాడు.

చూసేవాళ్ళకి అతను ఒక అపరాధ పరిశోధకుడుగా కనిపిస్తాడు. కాని నిజానికి హిట్లర్ వ్యవహారాల్లో అతిడు అపరాధ పరిశోధకునికంటె కూడ ముఖ్యమైనవాడు. ఏమంటే అపరాధ పరిశోధకునిలాగే అతనిపనికూడ హిట్లర్ రక్షణే. అయినా అపరాధ పరిశోధకుడు ఒక్క బయటి వ్యవహారాల్లోనే రక్షణ గమనిస్తాడు. కానెన్‌బర్గు హిట్లర్ జీర్ణకోశంలోకి పోయే పదార్థాల విషయంలో అవసరమైన జాగ్రత్తను వహించాలి.



అతడు హిట్లర్ వంటలవాడు. హిట్లర నియంతకు హితమైన ఆహారం కూర్చే కలాపానికంతకూ అతను కర్త

1938-వ సంవత్సరంలో కానెన్‌బర్గు పని రద్దీగావుండింది. అతడు హిట్లర్‌తో కలిసి ముసోలినీని కలుసుకోడానికి రోమ్ వెళ్ళాడు. అతడు హిట్లర్‌తో కలిసి నెవెల్లీఛేంబర్లేన్‌కు స్వాగతం ఇవ్వడానికి గాడెస్‌బర్గు వెళ్ళాడు.

తన పొట్టపూజకు ప్రధాన అర్చకుడయిన కానెన్‌బర్గు అంటే హిట్లరుకు వల్లమాలిన అభిమానం. విదేశపు రాయబారాలకు రాజ్యాంగవేత్తలకు అతణి పరిచయం చేయడమంటె హిట్లర్‌కు చాలా సరదా. అట్టి సందర్భాల్లో హిట్లర్ నియంత పలికే పరిచయవాక్యాలు ఎట్టివిగా వుంటాయి? 'ఇతడు హెర్ సెప్ కానెన్‌బర్గు— నా నియంత.' హిట్లర్ నియంతకు కానెన్‌బర్గు నియంత అన్నమాట.

ముసోలినీ, ఛేంబర్లేన్, డలాడియర్, ఎడ్మిరల్ హార్తీ మున్నగువారికి అందరకీ హిట్లర్ అతణ్ణి పరిచయం చేశాడు. హిట్లర్ యొక్క ఆహారపదార్థ నియామక విషయంలో కానెన్‌బర్గుది తుదిమాట. ఆ విషయంలో అతడు నిజంగా నిరంకుశుడు. ఆ నియంతను కాదనడానికి ఎవరికీ అధికారం లేదు.

కానెన్‌బర్గుకి, హిట్లర్‌కి గల పరిచయం చాలా కాలంనాటిది. 1923-వ నవంబరు మ్యూనిచ్ తిరుగుబాటుసందర్భంలో హిట్లర్ తల దాచుకోవడానికి పరుగెత్తవలసి వచ్చింది. అతడు అప్పుడు అట్లా పరుగెత్తుకు పోయి మ్యూనిచ్ పట్టణం పరిసరంలో వున్న ఒక చిన్న ఇంట్లో తలదాచుకున్నాడు. ఆ యిల్లు కానెన్‌బర్గుది. అప్పటికే అతడు వంటలవాడు. ఆ వంటలవాడికి హిట్లరు తిరుగుబాటుదారనీ, అతడికి ఆశ్రయం ఇవ్వడం ప్రమాదకరమైందనీ తెలుసు. తెలిసివుండికూడా కానెన్‌బర్గు హిట్లరుకి ఆశ్రయమిచ్చాడు. ఆ ఆపత్కాలంలో కానెన్‌బర్గు తనకు చేసిన సహాయాన్ని హిట్లరు మరిచిపోలేదు.

తాను అధికారంలోకి రావడంతోటే హిట్లరు కానెన్‌బర్గుకు కబురుపంపి పిలుపించుకొని అతణ్ణి తన వంటలవాడిగా చేసుకున్నాడు. —పత్రికామిత్ర.

# వెన్నెలనే

## కవికొండల వేంకటరావు, బి.ఎల్.

(గీతిక)

వెన్నెల నే పయనమంటే
చంద్రలోకమునకా? కాదు.
నీ కడ కో శోభనాంగీ!
నీ నవ్వుగుండ లలితాంగీ!

మోముచుట్టు మల్లెపూలు
మేలిముసుగ్గా వేసుకు,
వొంటినిండ జాజిదండ
సవరించుకు లేమమిన్న!

నవ్వుచుంటివా నడుస్తూ
పండువెన్నెలే నడుస్తూ
జారిపడే పూలనీడ
నూరిస్తివ నన్ను?

తెల్లవారు సరికోహో!
అన్నిపూలు జారిపోయి
నీయొంటి పసిమిమిసనాకు
నివ్వెర గొలిపేని వింత!

ఆనవాలు బట్టుటకొక
పువ్వుదారి గానవైతి;
నీనవ్వుల కిలకిలరుతి
పొడిగింపులె తుదకుమిగిలె

పువ్వులు! మఱిపానినీడ
లానవాలు బట్టుటకెటు
సాధ్యముగా నంతవడిగ
చెదరిపోయినవి. పూలు!

వెన్నెల! మఱిదానినాడు
మళ్ళివచ్చు నల్లేని
జాడసూప నంతవిధిగ
తరలిపోయినది. వెన్నెల!

నీ నడకకూడ నిలిపివేసి
నీకు నాకు మధ్యను, తెలి
నవ్వే యొక తెరగ వేసి
ఆశయ మరికట్టినావు!

నవ్వుగుండ అన్నానని
ఉత్తినవ్వు తెరగ వేసి
నన్నాపుట న్యాయమటే?
నాయూహ నీవెఱుగవటే?

నవ్వుతూంటే నవ్వునోట
తెల్లగ తెల్వారుటలో
ఎఱ్ఱగ రవి పొడుచుటలో
కనుటే నాపేరాస.

మనోవ్యాధికి మందులేదని పెద్దలు చెప్పేమాట ముమ్మాటికి నిజం.

# చింతాజ్వరం

సంతోషం సంగబలం
ఆనందమే ఆరోగ్యం
మనోజయంతు మాండవ్యః

రచయిత:

## వి. విశ్వనాధము బి.ఏ.

ఆరోగ్యంమహాభాగ్యమన్నారు. శరీరారోగ్యంవల్లనే మేధాశక్తి వృద్ధిపొందుతుంది అనీ, దానివల్ల ఐశ్వర్యం ప్రాప్తిస్తుందనీ పెద్దలు చెబుతారు.

కాని యీ లోకోక్తి యొక్క సత్యస్వరూపం వేరుగావుంది. ఆరోగ్యమైన ఆత్మ అనారోగ్యదేహంలోనే వుండటం చూస్తున్నాం. ఆత్మముందో దేహంముందో తేల్చే బాధ్యత తత్వవేత్తలది. అది వారు తెలిపితే ఈక్లిష్ట సమస్య యిట్టే విడిపోతుంది. అనారోగ్యదేహంవల్లనే వారు మేధావంతులైనారో మేధావంతులవడంవల్ల వారిదేహం అనారోగ్యం అయిందో తేల్చడం బహుకష్టతరమైన విషయం.

ఎందుచేతంటే ఒక జాతిలో వొక భాగం పూరికే పెరిగిపోతే వొకటి సన్నగిలి పోతుందికదా! ధనికులసంఖ్య పెరిగితే దరిద్రులు క్షీణిస్తారు. ధనికులు క్షీణించి వొకడే ధనవంతుడైతే దరిద్రులు పెరిగిపోతారు.

ఆలాగే మెదడు పెరిగితే దేహం క్షీణిస్తుంది. దేహంపెరిగితే మెదడు మొద్దు బారుతుంది.

చాలామంది మేధావంతులు బక్కపేగులవాళ్ళే. ఒక్కనరాల్లావున్న మన గాంధి, రాజాజీలు ఇందుకు నిదర్శనం.

బక్కపేగులేకాదు రోగగ్రస్తులు కూడాను. ఆమేధాశక్తి దేహబలమును రెంటిని సమానంగాను త్రాసులో తూచుకోగలవాడే ఆరోగ్యవంతుడు.

మేధావంతులని చెలామణియైనవారిలో చాలామంది రోగపీడితులేనా అయివున్నారు. లేదా వికలాంగులేనా అయి వున్నారు.

ఇంగ్లీషు మంత్రి శిఖామణి ఛేంబరలేనుకి చెవిపోటు విస్తారం. దానితో నానాఅవస్త పడుతుంటాడు.

ఇంగ్లీషు సారస్వతసేవకులలో కీట్సు జబ్బుచేత పెందరాళే స్వర్గం చేరాడు.

బరన్సు అనే మహాశయుడు వాతపునొప్పులు, పోట్లుచేతనే చనిపోయాడు.

మిల్టన్ మహాకవి గ్రుడ్డివాడు.

మన ఆంధ్రదేశంలో ఆంధ్రసారస్వతానికి, సంగీతానికి సేవచేస్తూవున్న చిలకమర్తి నరసింహంగారు, ద్వారం వెంకటస్వామినాయుడుగారు గుడ్డివారే.

పోపు, జాన్సన్, కారలైలు రోగపీడితులే. అమెరికా అధ్యక్షుడు కూడా తనరోగంవల్లనే గొప్పవాడైనాడు. మననాయకులలో గాంధీజీకి రక్తపుపోటు, సుభాషుబాబుకి గుండెజబ్బు. అతనిని తాతా అని పిలిచేవాడట సి. ఆర్. దాసు అతని జబ్బు శరీరాన్నిబట్టి. మనరాజాజీకి నీలిరంగు కళ్ళజోడు పెట్టుకోటానికి కారణంకూడా ఏదోజబ్బే, చత్వారంజోడుకాదు కనుక. అతనికి ఉబ్బసం జబ్బు వున్నట్టు, స్వయంగానే కొంతవరకు కుదుర్చుకున్నట్టు ఒకసారి యల్. ఐ. యమ్. స్కూలులో ముచ్చటిస్తూ శాబోలు వచించాడు. ఆంధ్రమహానాయకులలో పేరుగాంచిన దేశోద్ధారకునికి ట్యూబరుకు లోసిస్సు జబ్బు? దాంతోనే అంతరించి పోయిందా దేహం.

మొత్తంమీద గొప్పశక్తి సంపన్నులు—మేధాశక్తి—అయిన వారి అందరికి చాలావరకు దుర్బల శరీరాలే.

దీనికి కారణం ఏమై వుంటుంది? మన శరీరంలోని రక్తం పూర్వా

జ్జితం కాబట్టి యీ దుర్బలమైన శరీరానికి కారణం వంశం. అందుకనే మనవాళ్లు పెళ్ళిచేసేటప్పుడు ఏడుతరాలు, యిటు ఏడుతరాలు చూసి చేసేవారు పూర్వం. ఇప్పుడవి ఏమీఅక్కరలేదు లెండి.

తంటాలుపడి ఆత్మను దేహము నుండి వేరుచేయగలంకాని పుట్టువుతోనే వున్న శరీర అనారోగ్యాన్ని ఎట్లా బాగుచేయడం? దాన్నే మనవాళ్లుపూర్వజన్మసుకృతంఅన్నారు.

మనయోగులు, జోగులు ఆత్మశక్తియందు నమ్మకవుంటే యీ రోగాలు అన్నీ పోతాయి అన్నారు. ఈ మహనీయులందరూ ఆత్మశక్తిపైన నమ్మికలేని మేధావంతులేనా? అది అసంభవము. అలా అనడం వారి ఆత్మగౌరవం వంచన చేసినట్లు కాదు.

అనారోగ్యాన్ని ఆత్మశక్తిచే నిర్మూలింపగలమని చెప్పే వాక్యాలలో కొంతవరకు అపనమ్మకం కనుపిస్తోంది యీ మహనీయుల స్థితివల్ల, వారికి ఆత్మశక్తి లేదనడం అవమానించినట్లే కదా!

ఈదేశసేవకులు, మేధావంతులు యిలా దుర్బలు లౌటేకాదు, దుర్మార్గులు దుక్కలా వుండటం కూడా మనంచూస్తూనేయున్నాం.

జీవితపరిమాణం దేహారోగ్యం మీద ఆధారపడివుంది. ఆరోగ్యం లీవరుమీద ఆధారపడివుంది. ఆరోగ్యాన్ని చెప్పుచేతలలో నుంచుకుని నడిచేది మనస్సుఅని వప్పుకుంటాం. కొన్ని సమయాల్లో మనోబలంచేతనే ప్రాణాలు నిలబెట్టుకున్న మహనీయులగాథలు మన పురాణాలలో వున్నాయి. కొడుకువచ్చి తులసినీళ్లు పోస్తేనేగాని ప్రాణాలు వదలని ముసలమ్మలు అనేకమంది వున్నారు. కొంతమంది రోగులు తమ జీవితం మీద ఏవగింపువల్ల ముక్తిపొందారు.

అంచేతనే పెద్దలు ఏం చెప్తారంటే ఆనందం మందుగా పనిచేస్తుందన్నారు. మనోవ్యాధికి మందులేదన్నారు. మనోవ్యాధివల్ల ఎందరో ఏనుగులాంటివాళ్ళు పీనుగులవడం మనం నిత్యం చూస్తూనే వున్నాం. దుఃఖంచేత జుత్తు ఒక్కరాత్రిలో నెరిసినవాళ్ళను మనం చూస్తున్నాం. తిండి తినేటపుడు విచారవార్తను చెబితే ఆతిండి నీరు అయిపోతుంది, వంటపట్టదు. అందుకే అన్నం తినబోయేటప్పుడు దేవుడిపేరు చెప్పుకు తినమన్నారు. సంతోషమైన కబుర్లేకాని కోపము, విచారం కలిగించే విషయాలు ఎత్తవద్దన్నారు.

చింతవల్లనే ఆరోగ్యం చెడుతుంది. ఈ చింతాజ్వరానికి మందు లేదు. కాశీఖండంలో యీ చింతనుగూర్చి శ్రీనాథుడు యిట్లా వ్రాసాడు.

వింధ్యపర్వతమునకు మేరువుపై యీర్ష కలిగింది. దాంతో చింతాజ్వరం సంభవించింది.

సీ. "భేషజం బిద్దాని భేదింప నేరదు
లంఘనంబున నెద్ది లావు చెడదు
తఱిగించు బుద్ధినిద్రామహోత్సాహతు
ష్టాకారతేజోబలాది నెద్ది
నాసత్యచరకధన్వంతరిప్రభృతి వై
ద్యులకు నసాధ్యమై యుండు నెద్ది
దివసంబులాఱే నతిక్రమించిన యప్డు
జీర్ణత్వదశ నధిష్ఠింప దెద్ది
గీ. పరిత్యాహంబు నవత్వంబు వడయు నెద్ది
యట్టిచింతాజ్వరంబు నన్నలముకొనియె
నేమి సేయుదునింక నే నెచట జొత్తు
నెట్టు నిర్జింతు మేరుమహీధరంబు."

ఆచింతచేసే చెరుగు వర్ణనాతీతం. దాంతో తిన్నదంతా విషం అయిపోతుంది. ముఖం ముడతలు పడిపోతుంది. ఆచింత ఒక దురలవాటు. ఆరోగ్యంగా వుండాలంటే దేన్నిగూర్చి చింతించకూడదు. మంచిచెడ్డలు మానవసహజములు. కలిమిలేములు కావడికుండలు. ఒకనాడు జస్టిసు ఏలితే యీనాడు కాంగ్రెసు ఏలుతున్నది. రేపు ఎవరు వస్తారో! అలాగే యీకాలగర్భంలో దాగివున్నదానిని కనుక్కోడానికి ఆతురత ఎందుకు? దానికై చింతించడం ఎందుకు?

కాబట్టి దేనినిగూర్చి చింతింపవద్దు. ఆరోగ్యం చెడకొట్టుకోవద్దు కోపము అణచివేయి. కోపం పెరిగిందా ఆత్మహత్య చేసుకొన్నట్లే. అది శరీరాన్ని దగ్ధంచేస్తుంది.





Printed at the Andhrabhumi Printing Works, Vepery, Madras.
Editor & Publisher: Andra Seshagiri Rao. B.A.

త్వరలో వచ్చుచున్నది!

Rama Gopal Pictures Bezwada.
presents

# PASUPATASTRAM
# పాశుపతాస్త్రము

నటులు
నిడుముక్కల
రఘురామయ్య
సూరిబాబు
శకుంతల
అన్నపూర్ణ
మరికొందరు

Directed
BY
T. S. Mani

STUDIO.
ANDHRA CINETONE L^TD
VIZAG.

బుకింగులకు:- సరస్వతీ టాకీసు లిమిటెడ్., బెజవాడ.

కవి :

వఝల

కాళిదాసు



డైరక్టర్ :

టి.యస్. మణి.



సంగీతము :

వి. జె.

గోపాల్ సింగ్.

''పాశుపతాస్త్రము' గీతములు సన్ రికార్డులలో వినండి.